# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

కె. వై. ఎస్ పెంట్లవెల్లి.

ఆడామగా సమానమన్న మీ గోల చాలా విపరీతంగా ఉంది. ఆడవారి కెంత గౌరవం ఇవ్వాలో అంతవరకే ఇస్తారు. మీరు శుష్క ప్రయత్నాలు చేసి నగుబాట్లు కావడం . . . బాధగా ఉంది.

ఆడవారి కెంత గౌరవం ఇవ్వాలని నిర్ణయించే హక్కు మీకెవరిచ్చారు?! ఎవరూ ఇవ్వని హక్కులు పట్టుకు మీరింత పాకులాడుతున్నారే— ఉండవలసిన కనీసపు హక్కుల కోసం అడగడం— గోలగా తోస్తుందా స్వామీ మీకు??

ఎ. హెచ్ సిహెచ్ రేపల్లె

మనస్సు ఎక్కడుంటుంది?

మనమున్న చోట! ఇంకెక్కడుంటుంది?!

ఎ సి కె కల్యాణఖని

మీరు ఎప్పుడూ కాలు కిందికి దింపక కార్లలో తిరుగుతూంటారని విన్నాను. నిజమేనా.

నిజమే. కాళ్ల నొప్పులు మరి! ఏంచెయ్యను?

డి ఎల్ ఆర్ అయిజ

అక్కయ్యా, మనిషి పేరు తెచ్చుకోవాలంటే ఏం చేయాలి?

ఏ మీసా కిందో రావాలి. లేదా ఏ నేరమేనా చేయాలి. లేదా డబ్బిచ్చి పేపర్లో వేయించుకోవాలి.

బి ఎ ఆర్. విజయవాడ

అభిమానవతిలో మీ మాటలు బాగున్నాయి.

ఏం లాభం? డైలాగ్ కింగ్ ఆత్రేయ— డైలాగ్ ప్రిన్స్ సత్యానంద్, అన్నవాడు కనీసం డైలాగ్ పాపర్ కె. రా. అనేనా అనలేదు శ్రీనివాస్!

సిహెచ్ పి ఆర్. ఎల్లందల్.

మీ ఆడబొమ్మలో సరోజ, సరోజ భర్తలాంటి వాళ్లు . . మన దేశంలో లేరని నేను భావిస్తున్నాను

పొరపడుతున్నారు— మీకు తెలియరని భావించండి.

కె. వి కె ఎస్. పొన్నూరు

ఈ సంఘంలో మంచి పేరు తెచ్చుకోవాలంటే ఎలా నడుచుకోవాలి?

అతి మంచిగా కన్పిస్తే ఏం కథ? అంటారు. అతి విరసంగా కన్పిస్తేనూ ఏం కథ? అంటారు. అంచేత— మంచి పేరు తెచ్చుకోవాలన్నా చెడ్డ పేరు తెచ్చుకోవాలన్నా— నలుగురి నోట్లో పడేలా నడుచుకోవడమే!

బి బి కె ఖమ్మం

మీకు లక్ష రూపాయలు దొరికితే ఏం చేస్తారు?

ఏం చేశారని అడిగేలోగా ఖర్చు చేయగలను!

కె. ఎ ఎస్ ఆర్. అల్లూరు

సంస్కారవతుల, సంస్కార రహితులకు ఉదాహరణగా ఇద్దరి పేర్లు చెప్పమంటే మాలతీ చందూర్— కె. రామలక్ష్మిగారలు అన్నాడు. మీరేమంటారు?

నేను హాయిగా ఒప్పుకుంటాను. మీకేమేనా అభ్యంతరమా?!

వి. జె ఎస్ భువనేశ్వర్

ప్రేమించడం అన్నది నేడు సర్వ సాధారణం అయిపోయింది. ప్రేమ విలువ ఈనాడు 'రూపాయి విలువ'లాగే తగ్గిపోతుందంటాను.

దానికి కారణం కూడా ఆలోచించండి స్వామీ ప్రేమించడం, వరకే తమ యిష్టం కాని కట్నాలు, కానుకలు, సంప్రదాయాలు, కాలం, కట్లు— లాంఛనాలు, లంచాలు— అన్ని బేరాలూ, అమ్మా నాన్నా కుదర్చాలనే వెన్నెముక లేని 'యువత' కూడా కారణం కాద?

ఒక పాఠకుడు. హైదరాబాదు

ఫన్నీగా అడిగినదానికి యిలాంటి జవాబు (23—5—75 చివరి ప్రశ్న) ప్రశ్న వ్రాసిన వారికే కాకుండా చదివేవారికి కూడా మనస్సు నొప్పించేదిగా ఉంది.

బాగుంది వరస. మీరు ములుకుల్లా అడిగితే అది ఫన్నీ. నేను దానికి తగినట్లు బదులు చెప్తే — అది మనస్సుకు నొప్పి!! మగవాళ్లిలా మరీ అతి సుకుమారులైపోతున్నారేమిటి? 'గోల' 'ఏడుపు' కర్ణకఠోరం అయితే హిమజ్వాల లాంటి పుస్తకాలు ఎలా చదువుతారు?!

ఎస్. వి ఎన్ ఎస్ కటారుపల్లి

ఈ ప్రపంచంలో అతి విచిత్రమైనదేది?

అతివ మనస్సు! అది ఏ క్షణంలో ఏం అనుకుంటుందో ఎవరూ చెప్పలేరు.

విప్లవశ్రీ, హైదాబాదు

దిగజారిపోతున్న స్త్రీజాతిని మీరు సమర్థించడం చూస్తే నవ్వు వస్తుంది. వంటరిగా ఎవరైనా కుర్రవాడు కనిపిస్తే ఆటపట్టించడంలో పురుషులని మించిపోతున్నారు. వీరింకా దిగజారి పోడానికి మీరు దోహదం చేస్తున్నారు. అయామ్ రియల్లీ ఎషేమ్డ్ ఆ యు!

రియల్లీ! విప్లవశ్రీ. ఐటూ!! (రోజులు బావులేదు. పేరు మార్చుకో చిట్టి తండ్రీ)

పి. అర్ బుర్రిపాలెం

మిమ్మల్ని తల్చుకుంటే నాకొక్కొక్కప్పుడు అనిపిస్తుంటుంది . . . తెలివైన వారికి మనశ్శాంతి ఉండదుకదా!

నాకు తెలివి లేదు. కాని నాలుకకి పదునుంది. మనస్సుంది. కాని దాన్ని అనవసరపు విషయాలలో మునిగిపోనివ్వను. బుర్రుందని అప్పుడప్పుడు అనుకుంటాను. కాని మరుక్షణంలోనే లేదని తేలిపోతూ ఉంటుంది. అంచేత నన్ను గురించి బెంగపెట్టుకోకు సోదరీ— ఈ ప్రపంచంలో తెలివి దాచుకోవడం ఎంతో తేలిక. ●

## లింకన్ — నమ్మా నమ్మకపో — కెనెడీ

★ లింకన్ 1860 లో ఎన్నికైనాడు
కెనెడీ 1960 లో ఎన్నికైనాడు
(100 సం ల తర్వాత)

★ ఇద్దరూ కూడా తమ భార్యలు దగ్గరుండగా శుక్రవారంనాడు మరణించారు.

★ ఇద్దరికీ గుండు తలలోంచే దూసుకు పోయింది.

★ లింకన్ సెక్రటరీ పేరు కెనెడీ. అతను లింకన్‌ను సినిమాకు వెళ్లవద్దని సలహా యిచ్చాడు.
కెనెడీ సెక్రటరీ పేరు లింకన్. అతను కెనెడీని 'డెల్లాస్'కు వెళ్లవద్దని సలహా యిచ్చాడు.

★ లింకన్‌ను చంపిన 'బూత్' సినిమా హాలులో లింకన్‌ను చంపి "వేర్ హౌస్" లోనికి పారిపోయాడు
కెనెడీని చంపిన 'ఆస్వాల్డు' వేర్‌హౌస్‌లో కెనెడీని చంపి సినిమాహాలులోనికి పారిపోయాడు.

★ లింకన్ తర్వాత వచ్చిన ప్రెసిడెంట్ పేరు జాన్సన్
కెనెడీ తర్వాత వచ్చిన ప్రెసిడెంట్ పేరు కూడా జాన్సన్

★ లింకన్ తరువాత వచ్చిన ప్రెసిడెంట్ 'ఆండ్రో జాన్సన్' 1808లో జన్మించారు.
కెనెడీ తరువాత వచ్చిన ప్రెసిడెంట్ 'లిండన్ జాన్సన్' 1909లో జన్మించారు.
(100 సం ల తరువాత)

★ లింకన్‌ను చంపిన 'బూత్' 1813 లో జన్మించాడు.
కెనెడీని చంపిన 'ఆస్వాల్డు' 1913 లో జన్మించాడు (100 సం ల తర్వాత)

★ ఇద్దరు హంతకులు కూడా విచారణలు పూర్తికాకముందే చంపివేయబడ్డారు

—సేకరణ : ముద్దా రమేష్.

# ఉత్తేజించే డిజైన్లు

తీవిగా కనిపించేందుకు 37 మార్గాలు-
గ్రే కలర్‌లో మదురా సమకూర్చే
37 ఛాయలు, డిజైన్లతో ఆకర్షణీయమైన
260 ఛాయలు మరియు
డిజైన్లశ్రేణి-నేటివరకూ,
ఎవరూ, ఎక్కడా, ఎప్పుడూ
సమకూర్చని విస్తృత
శ్రేణిలో ఇవి కేవలం
ఒక భాగం మాత్రమే.

# ఊహాతీతమైన రంగులు




124.TEL

డిస్ట్రిబ్యూటర్సు : మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రైవేట్) లిమిటెడ్, విజయవాడ—520001. మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రైవేట్) లిమిటెడ్, మద్రాసు—600001. మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రైవేట్) లిమిటెడ్, 7—3—710 రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు—500003.

రిటైల్ షో రూమ్స్ : చెట్టినాడ్ ఏజన్సీస్, 40, మవుంట్ రోడ్డు, మద్రాసు—600006. మధుర ఫాబ్రిక్స్ రిటైల్ షాప్, 7—6 624 రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాద్—500003.

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 21–11–'75
రాక్షసనామసం. కార్తీకమాస బ. తదియ
*సంపుటము : 69 సంచిక : 11*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16–90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.

## విషయానుక్రమణిక

# ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

'దీపలక్ష్మి' పత్రిక ముఖార విందం
కార్తీక పున్నమ చంద్ర బింబం
ఇంద్ర ధనుస్సు కాంతుల కదంబం
రతిదేవినీ మించిన అందం
మా పాఠకుల హృదయాలలో,
వెల్లివిరిసే ఆనందం!
చిత్రాకారుడాగాచార్యాకు
నా కృతజ్ఞతలు.
కళాభిమానులు "ఆంధ్రపత్రిక"
సంపాదకులకు నా హృదయ ఆనందకృతజ్ఞతల
మల్లికలు.

సంకేపల్లి నాగేంద్ర శర్మ, (వేములవాడ)

### ప్రతి వారం

ప్రతి వారం మీ (మా) పత్రిక చదువుట వలన మాకు ఎన్నో తెలియని విజ్ఞాన విషయాలు తెలుసుకుంటున్నాము. ఈ శుభ సమయములో మా కోరిక ఏమనగా "ఉత్తరాలశీర్షిక" కాకుండా పాఠకుల ఉత్తరాలకు జవాబులిస్తే బావుంటుందని కోరుచున్నాము. వీలైనంత వరకు ఎక్కువ సంఖ్యలో "ఉత్తరాల శీర్షిక"లో ఎక్కువ ఉత్తరాలు ప్రచురించగలరని అలాగే "డాక్టర్ సలహాలు" కూడా ప్రచురించి మమ్మలందరిని మరియు వేలాది పాఠకులను ఆనందపరచగలరని దయచేసి కోరుచున్నాం. కృతజ్ఞతలతో

"జవ్వాజి" రేడియో శ్రోతాసంఘ టవర్ రోజు నుండి జవ్వాజి. సత్యప్రకాశ్‌రావు. గట్టు రాజేందర్, గట్టు గనేశ్, జవ్వాజి సుదాకర్ సంఘ సభ్యులు.

### కథలు

31—10—75వ సంచికలోని 'స్పాట్‌వేల్యుయేషన్'కదానిక చాలాబాగుంది. కట్నాలను కబంధ హస్తాలుగా, సముద్రపు ఘోషను ఆడపిల్లల తలిదండ్రులఆక్రందనగా అభివర్ణించిన రచయితగారు అభినందనీయులు. ఇలాంటి అనేక ఉపమానాలలో కథను ముందుకు నడిపిన తీరు బాగుంది కథానాయకునితో కథానాయికను— తాగుబోతుల బారినుండి తప్పింపజేసి కథానాయికకి కథానాయకుడు పిరికివాడు కాడని నిరూపించడానికే రచయితగారు అలాంటిసంఘటనను కల్పింపజేశారను కుంటాను.

ఠాకూర్ రాజేందర్‌సింగ్ (హైదరాబాద్)

*　　*　　*

24.10.75 పత్రికలోని శ్రీ చతుర్వేదుల నరసావధానిగారు వ్రాసిన 'హో గుమస్తా కథ' చాల సహజంగా ఉంది. పెద్దింటి విజయలక్ష్మిగారి 'ఇల్లాలు అన్న పూర్ణ' కథ కూడ చాల సహజముగా ఉంది. ముఖ్యముగా మధ్యతరగతి కుటుంబాలలో ఇలానే ఉంటాయి.

పి. సత్యనారాయణమూర్తి (మవులాలి.)

*　　*　　*

ఈ వారం పత్రికమీద లత ముఖచిత్రం చాలా బావుంది 'సీతాలు నిర్ణయం' కథ మాకు ఎంతో నచ్చింది. 'గెలుపునాదే' సీరియల్ ముందు ముందు యేమవుతుందో అనే ఉత్సుకతను కల్గిస్తోంది. డాక్టర్ సలహాలు మాకు విజ్ఞానాన్ని అందిస్తున్నాయి. మీ శీర్షికలన్నీ మాకు నచ్చాయి. కానీ ఒక విషయం మాత్రం మాకు నచ్చలేదు. అదే రామలక్ష్మిగారి 'ప్రశ్నావళి'. పేపరు కొరత ఎక్కువగా వున్న ఈ రోజుల్లో ప్రశ్నావళికోసం ఒక పేపరు వృథా చెయ్యడం అనేది శోచనీయం.

ఎం. వి. సుబ్రహ్మణ్యం, కె. శ్యామల, ఎం. ఎన్. లక్ష్మి, జోగినాథస్వామి, కె. రామమూర్తి, ఎం. విమల, వరలక్ష్మి, ఎస్. సునీత. (నూజివీడు)

### సీరియల్

వర్ధమాన రచయిత్రి కుమారి గౌరీదేవి గారి "గెలుపునాదే" సిరియల్ చాల ఇంటరెస్టింగ్‌గా నడుచుచున్నది. ఇంతమంచిసీరియల్‌ను అందించిన కుమారి గౌరీదేవిగారికి మా కృతజ్ఞతలు

టి. జానకి— (గుంటూరు.)

*　　*　　*

31—10—75 పత్రికలో "గెలుపునాదే" సీరియల్‌లో ఒక దగ్గర రచయిత్రి ఆగస్టు 17, అని రాస్తూ చలిగాలి వీచడం, చెవులకు మఫ్లర్ చుట్టుకొనడం, కొద్దిగ పొరపాటుగానే ఉంది. బహుశా చలిగాలి వీచడం ఆగస్టు నెలలోరాబోదనిమాఅభిప్రాయం "నేను—నావారు" కవిత ప్రవాసంలో ఉన్న ఆంధ్రులు (బమీన్, తెలుగువారైనప్పటికి హిందీ మాటలాడువారు)కు మంచి ఘాటైన మసాలావుందు.

సూరాడ నారాయణరావు, టి. దాలయ్య (జ్యోతి) యస్. గురుమూర్తి, యస్. ఇ.రేల్వే హిమ్‌గిర్ (ఒరిస్సా)

### సినిమా

"ఆలులేదు, చూలులేదు కొడుకుపేరు సోమలింగమ్" అన్నట్లు "సినిమా షూటింగు మొదలులేదు సినిమా విడుదలలేదు" విడుదల రోజున టియర్ గ్యాస్ తప్పదు అనుటచాలా అతిశయోక్తిగా ఉన్నది. లత ముఖచిత్రముగల 31—10—75 సంచికలో "శ్రీనివాస్"గారు 'సెక్రటరీ చిత్రము విడుదల రోజును టియర్‌గ్యాస్ తప్పదని వ్రాశారు. తెలుగు మహాసభల సహాయార్ధము సినీ కళాకారుల కార్యక్రమములకు, లేని టియర్‌గ్యాస్. పెద్ద పెద్ద సభలకు ఊరేగింపులకు లేని "టియర్‌గ్యాస్" "ఆ ట్రాల్" ఒక సినిమాకు ఉంటుంది. అనుట అతిశయోక్తిగా ఉన్నది.

ఆకెళ్ల సూర్యకృష్ణ, (విశాఖపట్టణము)

---

**★ మనలో మాట ★**

ఈ వారం సమయానికి అందనందు వల్ల 'లోకంపోకడ' కార్టూన్ శీర్షిక వేయలేక పోతున్నాము.

*　　*　　*

"గెలుపునాదే" కథ పై వారంతో ముగుస్తుంది "రాదారి పడవ" దీపావళి సీరియల్ కథ కూడా పై వారం వేద్దామనుకుంటున్నాము. మైనస్ బ్రతుకులు పై వారంతో పూర్తి అవుతుంది.★

---



నన్ను తెలుగుసినిమాలకు తీసుకురావద్దని నీకెన్నిసార్లు చెప్పాను-----ఆc!!



దీపావళిచిన్న సీరియల్ కథల పోటీలో ఎన్నికైన కథ

# మైనస్ బతుకులు



*(గత సంచిక తరువాయి)*

గట్టుమీద తుమ్మచెట్టు బ్రహ్మరాక్షసిలా వుంది. చిన్నప్పుడు ఫుస్తకాంటించే తుమ్మజిగురు ఆ బ్రహ్మరాక్షసిదే.

బళ్లకట్టు లేదు. దూరంగా కాలవ మీద కట్టిన వంతెన కనిపించింది.

'చాలా మారిపోయింది వూరు' అనుకున్నాడు.

కేశవరావు ఇల్లు పసికట్టేందుకు ఆట్టే శ్రమపడలేదు.

''నువ్వే వస్తావనే అనుకున్నా'' కాస్త కసిగానే అన్నాడు తొట్టి దగ్గర స్నానం చేస్తున్న కేశవరావు

లోపల్నుంచి భార్య తల మాత్రం తొంగి చూసింది.

ఇద్దరు పిల్లలు గంతులేసుకుంటూ వచ్చి "చుటాలొచ్చారోయ్ గొట్టాలు' చిందులేస్తున్నారు.

వాళ్ళ నోరు మూయించలేక రోషం చంపుకొని నిలబడ్డాడు.

''కూర్చో''

అరుగుమీదే కూర్చున్నాడు.

కాళ్లకి నీళ్లిచ్చింది భార్య.

''వెళ్లిపోదాం అనుకున్నా, అలా స్కూలు వరకూ వెళ్లొచ్చేలోగా బస్సుదాటి పోయింది'' కాళ్లు కడుక్కుంటూ అన్నాడు.

''నీళ్లు తోడమంటాను. స్నానం చేసుకొని రాత్రికిక్కడే వుండు.''

మురళి నమ్మలేకపోయాడు తన చెవుల్ని.

''మన చిట్టబ్బాయి ఎక్కడున్నాడ్రా ?''

''మిలిటరీలో కొన్నాళ్లు వెలిగించి పారిపోయి వచ్చాడు, తరవాత సినిమా ఛాన్సు వచ్చిందని వెళ్లాడు. ఏదో డబ్బా సినిమా లాగుంది. మొన్నే వచ్చింది. అందులో చిన్న వేషం వేశాడు ఆడదానిచేత తన్నులు తినే రౌడీ.''

"హరిబాబుగారి చంద్రం?"

"లండన్‌లో వున్నాడు అక్కడేదో దొరసాన్ని చేసుకున్నాడన్నారు. దొరసాని కాదు వంటలక్క, సర్వెంట్ మెయిడ్ అంటాడు చాటుగా నల్లాచారి."

''శర్మ?''

"ఇల్లరికం వెళ్లాడు. ఆమధ్య పిచ్చెక్కిందన్నారు......"

ఇక వివరాలు అడగలేదు.

కేశవరావే అన్నాడు. "మన బోండాంగాడి పని బావుందిరా. వడ్డీ వ్యాపారం టౌన్లో. ఇద్దరు పెళ్లాలు పోయారు. వాళ్లకి తిండి కూడా సరిగ్గా పెట్టడని రూమర్. మొన్నే మూడో పెళ్లి చేసుకున్నాడు."

''ఏరా కేశవా...'' గోడమీదినుంచి ఒక ముసలిగొంతు వినిపించింది "కాస్త యిటొస్తావంటరా......''

''బాబాయ్ ఎందుకో పిలుస్తున్నాడు. వస్తా."

మురళికూడా లేచాడు.

"నువ్వు లోపలకూర్చో. నేనొక మాట మాట్లాడి వచ్చేస్తా."

''ఏవండీ......'' లోపల్నించి పిలుపు.

చరుమని లోపలికెళ్లాడు.

"తనక్కడ వున్నట్టు నలుగురుకీ తెలియడం కేశవరావుకి యిష్టం లేదేమో."

"ఏంలేదు మురళీ. నువ్వు నా యింటి

కొచ్చావని తెలిస్తే నలుగురుకి సమాధానాలు చెప్పలేక చావాలి.''

తన పూర్వ చరిత్ర గురించి ఎవరికీ సదభిప్రాయం లేదన్న సంగతి అతనికి తెలుసు.

కేశవరావు గొడమీద నుంచే అయిదు నిమిషాలు మాట్లాడి వచ్చేశాడు.

''వూళ్లో అన్నీ గొడవలే. మొన్న అక్కరాజుగారి తలనరికి గుమ్మానికి కట్టారు. దేశం పాడైపోయింది. ఏరోజు ఏం వింటామో భయంగా వుంది.''

''ఏవండీ......''

మళ్లీ చర్రుమని లోపలికెళ్లాడు.

చాలా సేపు బయటికి రాలేదు. గుసగుసలు మాత్రం వినిపిస్తున్నాయి.

''భోంచేద్దాం రా......'' లోపల్నుంచే పిలుపు వినిపించింది.

నాలుగు మెతుకులు కతికాడు.

''పాలేరు అరుగు మీద పక్కవేశాడు. పడుకో...''

అయిదు నిమిషాల్లో బయట తలుపు మూసుకుంది.

మురళి మంచంమీద నడుం వాల్చాడు.

''కేశవా అప్పుడే యాత్తలువు ఏసుకున్నావట్రా... ...'' పాత గొంతే, కొంపలు ముంచుకుపోతున్నట్టు వినిపించింది.

భళ్లున తలుపు తెరుచుకుంది.

కేశవరావు నిద్రపోలేదన్నమాట. బయట ప్రపంచంలో ఏం జరుగుతుందో వినేందుకు రెడీగా కూర్చున్నాడు.

పావుగంట మాటలు సాగాయి.

మళ్లీ వచ్చి తలుపు మూసుకున్నాడు.

''బయట కాస్త గొడవగావుంది. మెదలకుండా పడుకో.'' లోపల్నుంచే ఆదేశించాడు కేశవరావు.

నిద్రపట్టదు మురళికి. ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. అక్కడనుంచి బయటపడాలని వుంది.

లాంతర్తో నలుగురు పెండెం విప్పుకొని లోపలికొచ్చారు.

''ఎవరా మడిసీ...'' లాంతరు పట్టుకున్న ఆకారం గర్జించింది.

సామాన్యంగా అరుగులమీద ఎవరూ పడుకోరేమో!

మురళి ముసుకుతన్ని పడుకున్నాడు

''సుట్టం.'' బయటపడ్డాడు పంచె సర్దుకుంటూ.

## దీపావళి పోటీలో రూ. 800 లు బహుమతి పొందిన కథ

అరుగులమీద కూర్చున్నారు లాంతరు పట్టుకొచ్చిన జనం.

''చంపినోడు నేనేనని పేరు చెప్పుకుంటాడా? దాని చీర రక్తంతో తడిసుంది కాబట్టి పట్టుకున్నారు.''

''గడ్డపలుగుతో పొట్టలో పొడిచారంట... ఇంకా ఎంతమందిని పొడుస్తారో...''

ఎవర్ని ముందన్నట్టు ఒకరిమొహా లొకరు చూసుకున్నారు.

''పోలీసులు దాన్ని వొదిలారా?'' కేశవరావు శంక వేశాడు.

తలుపు వెనకాల గాజుల చప్పుడవుతుంది. అతని భార్య వింటుందన్నమాట.

''ఎందుకొదుల్తార్రా పిచ్చోడా... చేతులు కట్టి లాక్కెళ్లారు.''

''అదేఁవంటుంది?''

''ఆయనే పొడుచుకు చచ్చాడంటుంది. కాసేపు ఎద్దు పొడిచిందంటుంది. దానిమాట నమ్మేదెవరు? చితక బాత్తేగాని నిజం చెప్పదు.''

''అదొక్కత్తే సంపదుగా... ముఠా గాంగోళ్లు వుంటారు మరి.''

అరుగుమీద జనాన్ని చూసి బయటినుంచి మరో గొంతు వచ్చి కలిసింది.

''ఈ ఇయరు ఇన్‌కారనేషన్ ఆఫ్ రాక్షసా అని ముందే చెప్పానుగా. ఈ నాటితో మంచి అనేదిమిగలకుండా పోయింది. పుణ్యమూర్తి... పురాణ పురుషుడు. ఆ మహానుభావుణ్ణి చంపింది లోకం. హోలీ భగవత్‌గీతలో లార్డ్

*జరిగినకథ 2:* చాలా కాలం క్రితం చనిపోయిన తల్లికి సమాధి కట్టించాలని మళ్లీ ఆ వూరు వస్తాడు మురళి. ఓ స్త్రీని వెంటాడుతూ తన కళ్లెదుటే దుర్మరణం పాలయిన వ్యక్తి ఆవూరి పెద్ద హరిబాబుగారని గుర్తిస్తాడు మురళి. పాత జ్ఞాపకాల వుచ్చులో చిక్కుకుంటాడు మురళి. హరిబాబు తాను మరదలు శ్యామలమ్మకు ఉరివేయడం కృష్ణజయంతికి ఉట్టి కొడుతూ మురళి చూశాడని తెలుసుకుని మెత్తగా బెదిరించగా మురళి కోర్టులో అబద్ధం చెప్తాడు.

క్రిష్ణ ఏం చెప్పాడంటే...'' ఆ గొంతు ఎవరిదో చెప్పనవసరం లేదు. నల్లాచారి ముసలాడయినా కంఠం చాలా వాడిగా వుంది.

''ట్వంటీ ఫస్ట్ సెంచరీలో ఎవడైనా నాచురల్‌గా చస్తే ఆశ్చర్యపడ్తారు. ప్రతి ఒకడూ హత్య చేయబడో, కారుకిందపడో, రైలుకింద తల పెట్టో, రైళ్లు పడగొట్టో, చంపుకునో, చంపో చస్తారట. కాబట్టి ఎర్లీగా పోయే వవంతా అదృష్టవంతులం ...''

ఆయన ధోరణికి అడ్డొచ్చి అన్నాడు కేశవరావు. ''ఇక పడుకుందాం పదండి.''

''ఆ మహానుభావుడే పోయాడు – ఇక పడుకోక ఏం చేస్తాం. పదండి రెస్టు తీసుకుందాం.''

తలుపు వెంటనే మూసుకుంది.

వెళ్తున్న నల్లాచారి వెనక్కి తిరిగొచ్చి అరుగుమీద పడుకున్న మురళికేసి దీక్షగా చూశాడు.

''వూరంతా కుతకుతలాడిపోతుంటే నీకెలా నిద్రపట్టింది నాయనా. మొహం చూసుంటే ముందే చెప్పేవాణ్ణి ఇన్‌ కారనేషన్ ఆఫ్ కుంభకర్ణా అని.''

''సుట్కం అయ్యోరూ... మీరెళ్లి పడుకోండి'' లోపల్నుంచే అన్నాడు.

మురళి గుండె రగిలిపోయింది. క్షణం పడుకోలేకపోయాడు. కేశవరావుని పిలిచి సంగతంతా పూసగుచ్చినట్టు చెప్పాలనితలుపు వరకూ వచ్చాడు.

తలుపే భళ్లున తెరుచుకుంది.

''నీతో ఒక మాట చెప్పాలని వచ్చా. ఫస్టు బస్సు అయిదింటికుంది. నన్ను లేపొద్దు. వెళ్లిపోతావుగా...''

తలూపి అరుగెక్కాడు మురళి.

ఊపిరాడటంలేదు. ఆదుర్దాతో నరాలన్నీ కొట్టుకుంటున్నాయి. తల ఆలోచనల పుట్ట అయిపోయింది. తర్క వితర్కాలతో పడి కొట్టుకుపోతున్నాడు.

మనసుకు ఏదరీ దొరకడంలేదు, చేతికి మంచం అంచులు దొరికినంత సులభంగా ...

డబ్బు చాలక తను కాలేజీ చదువు మానుకొని తిరిగొచ్చిన రోజులని ..

ఉద్యోగంకోసం కాళ్లకి బలపాలు కట్టుకొని తిరిగాడు.

## మైనస్ బతుకులు

అమ్మ ఇక్కడే తన కళ్లముందే పడి వుండ మంది.

అప్పుడే హరిబాబుగారి తమ్ముడు సూరి బాబుగారి గొడవ గుప్పుమంది.

నల్లాచారి ఆవూరి చరిత్రని రెండు భాగాలుగా విడగొట్టాడు. ర. ప్రె... ర. శ... అంటే 'ర' ఫర్ రంకు. అనగా చాకలి అమ్మాయి లవ్ ఎఫైర్ విత్ ప్రెసిడెంట్ సూరిబాబుగారు. దాని తరవాత జరిగిందంతా రంకు శకంట!

ర. ప్రె. లో ఆచారి అన్నదమ్ములిద్దర్నీ లార్డ్ రామా, లార్డ్ లక్ష్మణ అనేవాడు. ప్రస్తుతం మానేశాడు.

ర. శ. చరిత్ర సారాంశం ఇది.

ఉన్నట్టుండిహఠాత్తుగా ప్రెసిడెంటు సూరిబాబుగారు "చాకల్దానితో లేచిపోయా"డన్నారు.

కొందరు నమ్మలేకపోయారు. సీతకోసం గాలించారు. అదీ అదేరోజు, అదే గంట మాయమైపోయింది. దీని భావమేమి లార్డ్ తిరుమలేశా (ఆచారి నల్లమాటలు)

హరిబాబుగారికి తల నరికేసి నట్లైంది. వెంటనే మెంబర్లందర్నీ పిలిపించి తమ్ముడు చేసిన పనికి క్షమాభిక్ష వేడుకున్నారు. 'ఇంతటి నీచుడు యీ పదవికి తగడ'ని ఆయనే నిర్ణయం చేశారు.

కొత్త ప్రెసిడెంటు ఎవరన్నది నిమిషాల మీద తేలిపోయింది.

జానకిరామయ్యగారి జాతకం మారిపోయింది.

మూడోరోజు సాయంత్రం సూరిబాబు తిరిగొచ్చాడు. తండ్రిని చూసి గొల్లుమంది రాధమ్మ.

పదవి పోయిందని తెలిసి నిర్ఘాంతపోయాడు.

నిజానికి సూరిబాబు భార్యపోయి పదేళ్లు దాటింది. రాధమ్మ సంతోషంగా బతకాలని మళ్లీ పెళ్లి తలపెట్టలేదు. తరవాత ఆయన కాషాయాలు కట్టుకోలేదు. మహర్షి అయ్యే ప్రయత్నం కూడా చెయ్యలేదు. మామూలు మనిషిలాగే బతికాడు. అప్పుడే ఒకరిద్దరు వచ్చి "నిజమేనా ?!" అనడిగారు.

"నిజంగా నాకేం జరిగిందో తెలీదు. ఎవరో మత్తుమందు పెట్టి ఎత్తుకెళ్లిపోయారు." అన్నాడు.

ఒకరి మొహాలొకరు చూసుకున్నారు, శ్రోతలు. నవ్వాపుకోలేక అవతలికి వెళ్లిపోయారు. "చాకలి సీత మత్తుమందు పెట్టి ఎత్తుకెళ్లిపోయిందిరా."

కాస్త వయసులో పెద్దవాళ్లొచ్చి మందలించారు. "ఈ వయసులో పెళ్లీడొచ్చిన పిల్లని ఇంట్లో పెట్టుకొని ఏం పనులబ్బాయ్. పంచాయితీ బోర్డు ప్రెసిడెంటువి. అంతగా ఆ ముండ కావాలనుకుంటే ఏ సందకాడో దానింటికే ఎళ్లకపోయావా?"

ఇంతమంది ఎలానమ్మారో అర్థంకాలేదు.

"సొంత అన్నయ్యే చెబుతున్నప్పుడు నమ్మకేం చేస్తాం."

"అన్నయ్యే మీటింగు పెట్టించాడా ?"

"అవును మరి నువ్వు అట్లాంటి పని జేస్తే ఆయన మాత్రం ఏంజేస్తాడు ?"

తరవాత ఎవరడిగినా "నేను చాకల్దానితో లేచిపోయాను" అని కచ్చితంగా చెప్పేవాడు. వాళ్లు నవ్వకముందే తను పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వేవాడు.

అసలు రహస్యం అతనొక్కడికే తెలుసు. అది ఎవరికీ చెప్పనవసరంలేదు. చెప్పినా నమ్మరు.

ఆ రోజు నుంచి తిండి మానేశాడు. నిషా లేందే నిద్రపట్టేది కాదు. పనిలేనప్పుడు పగలూ రాత్రి తాగందే వుండలేకపోయేవాడు.

"ఏం నాన్నా ఇలా మారిపోయావ్?" అనడిగేది రాధమ్మ.

"మీనాన్న చనిపోయాడమ్మా. మీ పెదనాన్న కనిపించని కత్తితో పొడిచేశాడు."

ఒకరోజు నిజం చెప్పమని మొండికెత్తింది రాధ.

"ఇదొక గొప్ప పథకం తల్లీ. చిన్నప్పట్నుంచి మీ పెదనాన్నా నేనూ చాలా అన్యోన్యంగా వుండేవాళ్లం. ఆయన మీద యీగ వాలనిచ్చేవాణ్ణి కాదు. పేరుకు ప్రెసిడెంటుని నేనే. అయినా లెక్కలన్నీ ఆయనే చూసేవాడు. డబ్బు పెత్తనం అంతా ఆయన్దే......

"నాకు చిన్న అనుమానం... ఎందుకో

అడిగాను. ఒ(?)ప్పుకున్నాడు. పాత లెక్కలన్నీ తిరగేసి చూశాడు ..''

''నేను పాత లెక్కలు చూస్తున్న రోజే ఆయన పథకం ఆరంభమైంది......''

''మాటల సందర్భంలో 'మావాడి వ్యవహారం ఏం బాగోలేదు.. ఛి ...ఛీ ఆ సీత ముండతో...ఛీ ...ఛీ' చాలా నొచ్చుకునేవాడట......

''అనోట ఆనోట అలా పాకించాడు. నెమ్మదిగా కథ నిజం చేశాడు. పట్నంనుంచి రౌడీ ముఠాను పిలిపించి నాకు మత్తుమందు పెట్టించి మాయం చేశాడు. మూడురోజులు మైకం నుంచి తెలివి రాలేదు...''

''అలాగే ఇంకో మురా ఆ అమ్మాయి సీతని మాయం చేసింది.

''అప్పటికే మా కథ ప్రచారంలో పెట్టిన పెదనాన్న ధ్రువపరిచేశాడు. స్వంత అన్నే చెబుతున్నప్పుడు లోకం నమ్మక ఏం చేస్తుంది......''

''అలా నన్ను నైతికంగా పతనం చేసి తన దారి నుంచి పురుగులా అవతలకి నెట్టేశాడు... జానకిరామయ్య ఆయన తొత్తు. పైగా మా యిద్దరిమధ్య పొలం గొడవ ఒకటి కోర్టులో వుంది. ఈ వూళ్లో ఎవణ్ణి ఎప్పుడు, ఎలా గొంతు కోయాలో పథకం రెడీగా వుంటుంది....''

అప్పట్నుంచి కొత్త ప్రెసిడెంటు జానకి రామయ్యగారి జోరెక్కువైంది.

''ఏం బాబు, వుద్యోగం సద్యోగం లేకుండా వూరికే కూర్చోకపోతే మా ఇంటికొచ్చి కాస్త కుర్రాళ్లకి ప్రైవేటు చెప్పరాదూ ...'', ప్రెసిడెంటు హోదాతోనే చెప్పాడు, మురళితో.

జానకిరామయ్యగారి అరుగుమీద ట్యూషన్ ఆరంభించగానే మరో యిద్దరు హైస్కూలు కుర్రాళ్లు ట్యూషను చెప్పమంటూ వచ్చారు.

''గుడిదగ్గరున్న ఖాళీ యిల్లు యిస్తా. ఇట్లాగే ట్యూషన్ చెప్పావంటే నీకూ కాలక్షేపం వుంటుంది. నాలుగు డబ్బులూ వస్తాయ్...''

సలహాచెప్పి ఆ వెంటనే రంగంలోకి దిగాడు జానకిరామయ్య.

రెండు రోజుల్లో ఇల్లు రెడీ అయిపోయింది. ఒక బల్ల, కుర్చీ నాలుగు చాపలు వేయించాడు. రాత్రిళ్లు కరెంటు కావాలి. ప్రక్కనే సూరిబాబుగారి ఇల్లు. ఆయనే స్వయంగా వెళ్లి 'వూరికోసం, నలుగురు పిల్లల చదువుకోసం' మొహమాట పడకుండా అడిగాడు, మాజీ ప్రెసిడెంటుగారిని. ఆయనా కాదనలేదు.

బల్బు, వైరు తెప్పించి నిమిషాల మీద అన్నీ రెడీ చేశాడు.

స్కూలు జోరుగా సాగింది. రాత్రిళ్లు చదువు. పిల్లలతో మంచి కాలక్షేపం మురళికి.

రోజూ రాత్రి పది, పదకొండయ్యేది స్కూలు మూసేసరికి.

ముమ్మరంగా సాగుతుంది స్కూలు. ఒక క్షణం తీరిక ఉండటం లేదు. పగలు హైస్కూల్లో చేరబోయే కుర్రాళ్ల చదువు.

శ్రావణ శుక్రవారం. రాధమ్మ తలంటుకొని చిక్కు తీసుకుంటూ పడమటి గుమ్మం నుంచి మురళి పాఠాలు చెప్పడం చూస్తూ నిల్చుంది.

మురళి పరాగ్గా తలెత్తి చూశాడు. అతని దృష్టి అప్రయత్నంగా అక్కడే నిలిచిపోయింది.

రాధ రోజూ అక్కడే నిలబడి అతన్ని

## —ధర్మపథం—

# సంశయాత్మా వినశ్యతి

చరిత్రప్రసిద్ధమై అనేకమైన వింతలకు నిలయమైన ఒక పట్టణానికి ఒకడు వెళ్లాలని చాలా కుతూహలపడి బయలుదేరాడు. ఆ పట్టణం చేరడనికి అనేక మార్గాలు ఉన్నవి. ఏ మార్గాన వెళితే సుళువుగా చేరుకుంటామో అతనికి తెలియదు – అందువల్ల ఎవరినో అడగ్గా అతడు ఒక దారిని చూపాడు. ఇతడు ఆ మార్గంగా కొంతదూరం ప్రయాణం చేశాక తనకే సందేహం కలిగింది – అది సరియైన మార్గం అవునో, కాదో అని. అందుచేత ఆ దారినే పోతున్న ఒకరిని అడిగాడు – తన గమ్యస్థానానికి అది సరియైన మార్గమేనా? అని. అతడు 'అయ్యో! మీరు పొరపాటు పడ్డారు. ఈదారిని పోవడం సరికాదు.'' అని మరోమార్గాన్ని చూపాడు. ఆయన వెనక్కుపోయి, అతడు చూపిన దారినే చాలా దూరం ప్రయాణం సాగించాడు. మళ్లీ సందేహం కలిగింది అది సరియైన దారి అవునా, కాదా? అని. తనకు కనపడిన మరో వ్యక్తిని ప్రశ్నిస్తే అతడు అది సరియైన తోవ కాదని మరో మార్గం సూచించాడు. ఈ సందిగ్ధుడు ఆ దారిని పట్టుకొని ప్రయాణం సాగించాడు. కాని, కొంతదూరం పోయాక మళ్లీ సందేహం కలిగింది ప్రయాణికులలో ఒకరిని అడిగితే అతడు చేరదలచుకొన్న పట్టణానికి అది తగిన దారి కాదంటూ మరోదారిని చూపించాడు. ఈ సంశయాగ్రస్తుడు ఆ మార్గంగా వెళుతూ, మరల సందేహించి ఇంకొకరిని అడగ్గా అతడు ఇంకో దారిని చూపాడు. ఈ విధంగా అతనికి మార్గాలు మారడంతోనే సరిపోయింది. అతడు గమ్యస్థానాన్ని చేరుకోనేలేదు.

ఆత్మతత్వాన్ని తెలుసుకొన గోరేవారి పద్ధతికూడా ఇటువంటిదే!

ఆత్మతత్వాన్ని తెలుసుకోదలచిన యెడల ఒక గురువును ఆశ్రయించి, కొంత తెలుసుకుని, ఆయన సరిగా బోధించలేదని ఆయనను విడిచిపెట్టడం, ఇంకొకరిని ఆశ్రయించడం సరియైన పద్ధతి కాదు. కొంత కాలానికి ఆయనవిషయంలో కూడా అసంతృప్తి కలుగుతుంది. అందువల్ల మరొక గురువును మార్చాలనే బుద్ధి కలుగుతుంది కూడా. ఈ విధంగా గురువుల యెడల సందేహం కలుగుతూ వుంటే తత్వాన్ని గ్రహించడం సాధ్యపడనే పడదు.

అందువల్ల మనస్సుని నిస్సందేహంగా ఉంచుకోవాలి. మొదటనే బాగా ఆలోచించి, తగిన గురువును నిర్ణయించుకోవాలి. ఆయన ఉపదేశించేది కొంతకాలం అవగాహన కాకపోయినా, ఆయననే నమ్ముకొని వుంటే క్రమంగా అవగాహన కాగలదు. మనస్సులో సందేహం కలగడంవల్లనే గురువుల మార్పిడికి అవకాశం ఏర్పడుతుంది. సందేహం లేకుండా మనస్సును స్థిరంగా ఉంచుకున్నప్పుడే ఒక్క గురువునే నమ్మి ఉన్నప్పుడే మానవుడు ఆయన మూలాన ఆత్మతత్వాన్ని తెలుసుకోగలుగుతాడు.

—బులుసు వేంకటరమణయ్య

## వెయిటింగ్ బతుకులు

చూస్తూనే వుంది. మురళి చూడటం ఇదే మొదటిసారి.

విశాలమయిన కళ్ళు, రక్తంతో పెరిగిన రోజా పువ్వుల్లాంటి చెక్కిళ్ళు, సూర్యరశ్మికి ఎర్రగా మెరిసిపోతున్న ఎర్ర చీరలో ఆమె కిరణంలాగుంది. గాలికి ఎగిరి పడుతున్న ముంగురులు చెక్కిళ్ళమీద చేపపిల్లల్లా ఆడు కుంటున్నాయి.

అతన్ని ప్రత్యేకంగా ఆకర్షించింది ఆ పొడవైన జడే. మోకాళ్ళనంటి, నేలని తాకాలని ప్రయత్నిస్తోంది. ఇంత పెద్ద జడ యీ ప్రపంచంలో ఎవరికీ లేదేమో.

రాధ నవ్వింది.

నవ్వలేకపోయాడు మురళి.

రాధ చాలాసార్లు తన యింటికి వచ్చినా ఇంత పరీక్షగా చూడలేదు.

ఒకసారి లోపలికెళ్లి మళ్లీ స్కూలు గుమ్మంవరకూవచ్చి "నమస్కారంమాష్టారూ" అంది.

అంత అందమయిన అమ్మాయి అతన్ని మాష్టారూ అంటే నవ్వకుండా వుండలేక పోయాడు.

"సాయంత్రం నాన్నగారు మీతో ఏదో మాట్లాడాలన్నారు. వస్తారు కదూ..."

మురళి సమాధానం వినకుండా తుర్రు మంది రాధమ్మ.

సాయంత్రంవరకూ పిల్లల పాఠాలు సరిగ్గా సాగలేదు.

ఒకటి రెండుసార్లు గడియారం చూసు కున్నాడు. ఆగిపోయిందేమోనని అనుమానం వచ్చి చెవిదగ్గర పెట్టుకొని విన్నాడు.

'టైం నడవడంలేదు' అతనికి.

ఎవరో కుర్రాడు ఏదో అడిగినందుకు విసుక్కున్నాడు.

నాలుగున్నరకి గుమ్మంనుంచే రాధ చేత్తో రమ్మంటున్నట్లు సైగ చేసింది.

ఆ భంగిమ చూసి గతుక్కుమన్నాడు మురళి. అతని రక్తం పొంగుతున్నట్లు, నరాలు పట్టు తప్పిపోతున్నట్లు అనిపించింది.

కళ్లతోనే లాలించి త్వరగా రమ్మన్నట్లు నసిరింది.

అది కోపంకాదు.

ఆమె కను పాపలు రంపాల్లా అతని గుండెమీద పనిచేస్తున్నాయి.

అతని కాళ్లు రాధమ్మ ఇంటికి ఎప్పుడు, ఎలా లాక్కెళ్లాయో అతనికే తెలీదు.

"కూర్చోబాబూ" సూరిబాబుగారిగొంతు.

కూర్చున్నాడు.

"మీ నాన్నగారు నాకు బాగా తెలుసోయ్. ఆ భూములు చూపించింది నేనే. పాపం వారికి రుణం లేకుండా పోయింది.

సూరిబాబుగారిని చూడగానే ఆయన మతలబులులేని మనిషి అనిపించింది మురళికి.

చాలాసేపు పిచ్చాపాటీ మాట్లాడారు.

"మరేంలేదు బాబు. రాధమ్మ తల్లి చిన్న ప్పుడే పోయింది. ఇంట్లో ఎవరూ లేక పోవడంవల్ల చదువు చిన్నప్పుడే మాన్పించా. దానికిప్పుడు చదువుకోవాలని వుంది. కాస్త ఇంటికొచ్చి రోజూ పావుగంట చదివించ రాదూ."

చాలా పుత్సాహంగా "సరే" అన్నాడు.

ప్రతిరోజూ పావుగంట కాదు, గంట చదివిస్తున్నాడు. భోజనానికి మాత్రం ఇంటికి వెళ్తాడు. అక్కడే కాఫీలు, టిఫిన్లు.

మురళికి జీవితం మళ్లీ పచ్చగాకనిపించింది. ఒక క్షణం ఆమెను చూడకుండా వుండలేక పోతున్నాడు. ఇది నలుగురూ చూస్తున్నారనే స్పృహ ఇద్దరికీ లేదు.

సంవత్సరం ఒక క్షణంలా గడిచి పోయింది ఇద్దరి మధ్య.

(పై వారమే ముగింపు)

## ★ కరవని చెప్పులు ★

ఎంత మంచి వనుకొన్నా కొత్త చెప్పులు వేసుకోగానే కొందరికి కాళ్లకు బొబ్బలు వచ్చితీరతాయి. మరి ఇప్పుడు అమెరికాలోనేమో ఒక సంస్థ బొబ్బలు పడని చెప్పట్లు తయారుచేసి అమ్ము తున్నదట. ఎప్పుడూ చెప్పులు విడవని వారికి, బూట్లు వేసుకొని ఆటలు ఆడే వారికి ఈ కొత్త పాదరక్షలు వీలుగా ఉంటాయంటున్నారు ఈ చెప్పట్లు రాపిడిలేకుండా ఉంటాయి. నీటిలో తడిసినా చెడవు. చాలా కాలం మన్ను తాయి అని టెక్సస్ రాష్ట్రంలో స్పైన్స్ మెడికల్ కార్పొరేషన్ చెబుతున్నది. ఇది వారి తయారీ.

చెప్పులకే కాక, శిరస్త్రాణాలకు, కృత్రిమ అవయవాలు వంటి వాటి లోతట్టున వెయటానికికూడా ఈఅట్టి బాగా ఉపయోగపడుతుందట.

"ఏమేవ్! ఓ సారిలా రా.

గుమ్మంలో నిలబడే గట్టిగా పిలిచారు రామనాథంగారు.

వంటింట్లో పనిచేస్తున్న శాంతమ్మ తడిగా ఉన్న చేతిని కొంగుకు తుడుచుకుంటూ ఎదురుగా వచ్చింది.

"ఏమిటండీ ఆ గావుకేకలు! కొంపలంటుకొన్నట్లు!" పనిలో ఉన్నప్పుడు పిలిస్తే చికాకేస్తుందామెకు.

"విశాఖపట్నం పెళ్లివారు మన రేఖను చూడ్డానికి రేపు సాయంత్రం వస్తారట ఉత్తరం రాసారు!"

ప్రక్క గదిలో పత్రిక సీరియల్ సీరియస్‌గా చదువుతున్న రేఖకు నాన్నగారి మాటలు స్పష్టంగా వినిపించాయ్. కథ మరి నడవ లేదు. పుస్తకాన్ని టేబుల్‌పై విసిరి కుతూహలంగా వారి మాటలు వింటోంది. రామనాథంగారు కాబోయే వియ్యాల వారి వివరాలు వివరిస్తున్నారు.

పెళ్లికొడుకు పేరు మాధవరావు బి కాం. ప్యాసయ్యాడు. షిప్పింగ్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. జీతం నాలుగొందలు. ఒక్కడే కొడుకట, తండ్రి లేడట. తల్లి మేనమామ యింట్లో ఉంటున్నదట. పెళ్లికొడుకుకు సిగరెట్లు తాగడం, కిళ్లీ వేయటం, డ్రింక్స్ (బ్రాందీ) తీసుకోవటం మొదలైయిన అల వాట్లు లేవట.




దానికి శాంతమ్మ సంబరంగా "పోనీండి! రేఖ అదృష్టవంతురాలు! పైగా చెడు అలవాట్లు లేవంటున్నారు!" సంతృప్తినీ సంతోషాన్ని వ్యక్తం చేస్తోంది. (ముఖ్యంగా మూడవ అలవాటులేదని ఆమె ఆనందం)

కొద్ది నిమిషాలు రేఖ ఊహాలోకంలో విహరించింది. తనకు కాబోయే భర్తను సుకుమారుడిగానూ, సుందరరూపిగాను ఊహించుకొంది. కానీ వెంటనే గగుర్పాటు పొందింది. తన జీవితంలో మొట్టమొదటిసారిగా పెళ్లి చూపులు. ఏమేమి ప్రశ్నలు వేస్తారో! తను అతనికి నచ్చుతానో లేదో! అన్న అనుమానం వచ్చి భయకంపితురాలైంది. నిజానికి రేఖ అందమైన పిల్లే! అయినా అలా అనిపించింది. ఓసారి లేచి అద్దంలో మోహం చూసుకుంది.

ఇంతలో తండ్రి గదిలో ప్రవేశించడం గమనించింది అద్దంలో నుంచే...సిగ్గుతో తల వంచుకొంది. ఏదో అర్జంటు పనున్నట్లు పెరట్లోకి తుర్రుమంది. తండ్రివైపు చూడకుండా....

పెరట్లో తల్లి పక్కవాటాలో నున్న పిన్నిగారితో చెప్పేస్తోంది. పెళ్లివారి విషయం... వారి అంతస్తు, హోదా ఏకరువు పెడుతోంది.

"అయితే రేఖ త్వరలోనే పెళ్లికూతురవుతుందన్న మాట!" అంది ఆమె రేఖ వైపు పట్టి పట్టి చూస్తూ...

కానీ శాంతమ్మగారి ధోరణి శాంతమ్మ గారిదే.

"పెళ్లికొడుక్కి ఏమీ చెడు అలవాట్లు లేవట అక్కయ్యగారూ! కనీసం కిళ్లీకూడా వేసుకోట్ట!"......

"నిజంగా రేఖ అదృష్టవంతురాలు అక్కయ్యగారూ!" మెచ్చుకొంటోంది ఆమె మాటలు కలుపుతూ!

ఇక అక్కడ కూడా వుండలేకపోయింది రేఖ. ఏదో చెప్పలేని అనుభూతి, సిగ్గు ముంచుకొచ్చింది.

పెళ్లివారు వచ్చేరోజు! హడావిడి ఎక్కువై పోయింది. ఇంటిని ముచ్చటగా అలంకరిం

### సముద్ర జంతువుల భాష

పసిఫిక్ సముద్ర మత్స్య పరిశ్రమ, సముద్ర శాస్త్ర పరిశోధన సంస్థవారు సముద్ర ధ్వనుల భాండారాన్ని సేకరించేరు. డాల్ఫిన్‌లు, స్పెరమ్ తిమింగిలాలు, టన్నీ చేపల సంభాషణలు, స్లైనే, గూని సాల్మన్, హెరింగ్, సముద్రపు ముళ్ళ పంది, మొలుస్కాల ధ్వనులు టేపులమీద రికార్డు చేయబడినాయి. సముద్ర జంతువుల్లో ఒకదానితో ఒకటి మాట్లాడుకోవడం ఎంతగా అవసరముంటుందో శాస్త్రవేత్తలు తెలుసుకోడానికి యీ టేపులు సాయపడతాయి.

చారు. ఫర్నిచరును అందంగా సర్దారు. పక్కింటి పిన్నిగారి సహాయం కోరింది. శాంతమ్మ... మధ్యాహ్నం రెండయేసరికి పెళ్లివారొచ్చారు. పెళ్ళికొడుకు, పెళ్ళికొడుకు తల్లి, మేనమామ మొత్తం ముగ్గురువచ్చారు. పెళ్ళికొడుకు మేనమామ మిలటరీ రిటర్నడ్ మిలటరీలో తనుచేసిన ఘనకార్యాలు, సాహసాలు ఏకరువు పెట్టేస్తున్నాడు. తరువాత చుట్టరికాలలోనికి దిగాడు తను బంధువులు ఎక్కడెక్కడ ఉన్నారో, ఎక్కడెక్కడ ఉద్యోగాలు చేస్తున్నారో చెప్పసాగారు. రేఖ తండ్రి ఔరా! అన్నట్లు ఊకొడుతున్నారు.

రేఖకు పెళ్ళికొడుకును చూపించింది కిటికీ సందులోంచి పక్కింటి పిన్నిగారు సిగ్గు నటిస్తూనే చూపింది. బాగానే వున్నాడనుకొంది రేఖ.

పెళ్లిచూపులు ఏర్పాటు చేశారు. కుచించుకొని చాపమీద కూర్చొంది రేఖ... పెళ్లికుమారుని మేనమామ, రేఖ తండ్రి యేవేవో విషయములు మాట్లాడుకొంటున్నారు...... దూరపు బంధుత్వాల్ని దగ్గరచేసుకొంటున్నారు ఎలాగో వీలు చూసుకొని పెళ్ళికొడుకును చూడాలని తహతహలాడుతోంది రేఖ...... అతడు తొడుక్కున్న టెరీకాటన్ ఫాంటూ, బూటూ మాత్రమే కనబడుతున్నాయి. ఇంకా పైకి చూడాలని కోరికే!

"ఒక్కసారి అబ్బాయిని నీవు కూడా చూడమ్మా!" అన్నారు పెళ్ళికొడుకు మేనమామ, విశ్వంగారు.

## పెళ్ళినాడు

అయినా సాహసించి తలెత్తలేకపోయింది రేఖ రేఖ అన్న బిస్కట్లు తెచ్చి వాళ్ల ముందున్న టీపాయ్ మీదుంచాడు.

"డ్రింక్స్ కూడా పట్టుకు రారా! రమేష్!" పురమాయించారు రామనాధంగారు.

వెంటనే అదోలా నవ్వారు. పెళ్లికొడుకు మేనమామ విశ్వంగారు.

అందరూ అతనివైపు చూశారు.

"మీరు డ్రింక్స్ అనగానే నాకు ప్రాణం లేచివచ్చిందనుకోండి! అస్సాం బోర్డరులో ఉన్నప్పుడు గడగడలాడించే చలి మంచు, చెట్లనుంచి ఆకులు రాలేటట్టుగా రాలేది... అలా పెగ్గు మీద పెగ్గు వేసుకొంటేనేగాని ఉండలేక పోయేవాళ్లం" అన్నారు.

అందరూ పరీక్షగాచూశారుఆయనవైపు.

"ఏమిటలా చూస్తున్నారు... ఇప్పుడా అలవాటు పూర్తిగా తగ్గించేశాననుకోండి! వయసునుబట్టి అలవాట్లు మార్చుకోవాలి మరి! . డాక్టరు గట్టిగా హెచ్చరించాడు కూడా. భయంవేసి మానేసాను."

"మా కుటుంబంలో అలాంటి అలవాట్లు ఎవరికీ లేవు సుమండీ ముఖ్యంగా మీ కాబోయే అల్లుడు కిళ్లీకూడా నమలడు" అన్నారు.

తృప్తిగా చూశారంతా పెళ్లికొడుకు వైపు. అప్రయత్నంగా తలెత్తింది రేఖ, అతనుకూడా తన వైపే చూస్తుండడంతో చూపులు అనుకోకుండా కలసిపోయాయ్. సిగ్గుతో వెంటనే తల దించుకొంది!

*     *     *

"రేఖా! పిలిచాడు మాధవరావు మంచం మీద కూర్చొంటూ. రేఖ పలకలేదు ... తల వంచుకొని దూరంగా నిలబడింది...

"రేఖా" మరలా పిలిచాడు లాలనగా.

"... ... ..."

"ఏమిటి కొంపతీసి మూగదానివా ?"

తలెత్తింది! కాదన్నట్లు అడ్డంగా తిప్పింది.

"అయితే మొదటిరాత్రి యిలా మౌనంగానూ, విరహంతోనూ గడపాల్సిందేనా" అని దగ్గరగా వెళ్లి చెంపలను తాకాడు...

అనిర్వచనీయమైన అనుభూతిని పొందింది.

'ఏమి మాట్లాడమంటారు ?" అంది

వేయి వీణలు మీటినట్లయింది మాధవరావుకి.

"హమ్మయ్య! మూగదానివనుకొని హడలి చచ్చా!" అన్నాడు గమ్మత్తుగా బుజాలెగరవేస్తూ. చెయ్యి పట్టుకొని మంచం దగ్గరకు తీసుకొని వెళ్లాడు... మంచంమీద కూర్చొని "కూర్చో" అన్నాడు

"అయితే మీరు ఏమీ తీసుకోరా ?" అడిగింది.

"అంటే ?" అన్నాడు అర్థంగాక. ప్రక్కనే ఉన్న టేబులువైపు చూపించింది...

"చంపావ్ !" అన్నాడు.

"అంటే ? "

"తీసుకోరా! అంటే మా మిలటరీ మామయ్యలా ఏమైనా డ్రింక్స్ తీసుకొంటారా అని అడుగుతున్నావేమో అని హడలి చచ్చా "

"మీ కలాంటి అలవాట్లు లేవటగా !" ఓరగా చూస్తూ అడిగింది ఆపిల్ ముక్కలు అందిస్తూ ... ఓ ముక్క కొరికి అందించాడు .. సిగ్గుతో అందుకొంది

'పోని పాలైనా తాగుతారా?"

"అహా! నిరభ్యంతరంగా!" అంటూ పాలగ్లాసందుకొన్నాడు.

"తాగేవాళ్లంటే నాకు చచ్చేంత భయం" అంది దగ్గరగా జరుగుతూ.

"నాకు భయం మాత్రం లేదు సుమా, ఎందుచేతనంటే నా ఫ్రెండ్సులో చాలా మందికి అలవాటుంది!... ఇప్పుడో ఫాషన్ అయిపోయింది!" పాలగ్లాసు ఆమె నోటిదగ్గర పెట్టాడు...

"మరి తమలపాకులు, చెక్కలూ! ..."



సగంలో ఆగిపోయింది అర్థోక్తిగా.

చెక్కముక్కలు అప్పుడప్పుడు వేసుకొనే వాణ్ణి! నాకు జంట కుదిరితేగాని ఆకు, చెక్క జంటగా వేసుకోకూడదని శపథం చేసా!... ఈనాటితో ఆ శపథం తీరిపోయింది! ఆ విషయంలో నీ యిష్టం! నీ ఓపికానూ!''

ఆకులు చెక్కా తానే తీసాడు.

* * *

రేఖా మాధవరావులు కంపెనీ యిచ్చిన క్వార్టర్సులో కొత్త కాపురం... మాధవరావు ఉదయం పది గంటలకు భోజనంచేసి ఆఫీసు కెళ్ళి తిరిగి వచ్చేసరికి సాయంత్రం ఆరవు తుంది... ఏమీ తోచేది కాదు రేఖకు... వార పత్రికలు చదివి పారేసింది. అంతా కొత్త... ఇరుప్రక్కల క్వార్టర్సు వున్నాయి... కొత్త మొహాలు! తనకుగా వెళ్ళి పలకరించాలంటే అదోలా వుంది. పైగా కొత్త పెళ్ళికూతురు ... కాలక్షేపం కష్టమనిపించింది ... ఆ రోజు ఇంటికి రాగానే అడిగింది, భర్తని...

''మీరేమో ఆఫీసు కెళ్ళిపోతున్నారు! ఏమీ తోచక చస్తున్నా!'' అంది మంచినీళ్లం దిస్తూ.

''ఆగు! వచ్చి రెండు రోజులేగాలయింది! అందరినీ పరిచయం చేస్తా'' అన్నాడు గ్లాసందుకొంటూ.

''మాధవరావుగారున్నారండీ!''

కేక వినిపించింది వీధిలోనుంచి.

మాధవరావు బయటకు వెళ్ళి చూసాడు.

''ఓ! రండి రండి! శంకరం గారు!'' ఆహ్వానించాడు మాధవరావు అవతలి వ్యక్తిని ...రేఖ వంటింట్లోకి జారుకుంది! ... చికాకుగా.

''రేఖా! కాఫీ పట్టుకురా!''

కాఫీ పట్టుకొని వెళ్లక తప్పింది కాదు! రెండు కప్పులూ టీపాయ్ మీద వుంచి దూరంగా నిలబడింది.

''రేఖా! వీరు మా ఆఫీసు అక్కౌంటెంటు! శంకరంగారు ... మనపక్క వాటాలోనే ఉంటున్నారు!'' పరిచయం చేసాడు మాధవరావు కాఫీ కప్పు తీస్తూ.

''నమస్కారం అండి!'' అంది చేయి జోడించి తడబడుతూ.

''చూడమ్మా!! నమస్కారం పెట్టుకొంటే మనుషులు, మనస్సులు చాలా దూరంగా వుండాల్సి వస్తుంది. ఇరుగు పొరుగు వాళ్లం! మీ వదిన మీ ఇంటికేవచ్చి




తన్నుతాను పరిచయం చేసుకోవాలను కుంటోంది. నీవు కొత్త పెళ్లికూతురివి కదా! మరి!...'' అని ఆగారు.

ఆయన చనువుగా మాట్లాడుతుంటే సిగ్గుపడి తప్పుకొని తిరగడం సభ్యత గాదని పించింది రేఖకు.

''ఆ! చూడు మిస్టర్ మాధవరావ్! మన ఆఫీసరు ఫారిన్ లిక్కర్సు నాలుగు తెప్పించారుట! రమ్మని కబురంపించారు ... అంటే వెళ్తున్నా! నీవు వస్తానన్నావు వెళ్దామా?''

మాధవరావు వెంటనే జవాబీయలేదు. భార్య వైపు చూసాడు ... రేఖ తల దించుకొంది. ఆమె మొఖం కనబడలేదు.

''నేను మరోసారి వస్తాసార్! మాకో చిన్న ప్రోగ్రాం వుంది. క్షమించాలి!'' అన్నాడు మాధవరావు.

''ఓ! అయామ్‌సారీ! ఐ షుడ్ నాట్ డిస్ట్రబ్‌యూ! మరి నే వస్తా! వెళ్లొస్తాను చెల్లాయ్'' అంటూ వెళ్ళిపోయాడు.

ఆయన వైపు చూస్తూ ఉండిపోయింది రేఖ! గాలివాన వెల్సినట్టయింది.

''ఆయన చాలా కలుపుగోలు మనిషి! కపటం ఎరగడు'' అన్నాడు మాధవరావు అతనివైపే చూస్తూ.

''ఆయన భార్యకూడా అంతేనా?'' అడిగింది కాఫీ కప్పులు తీస్తూ

''ఆ! యిద్దరూ అంతే కల్లాకపట మెరుగనివాళ్ళని ఒక్కచోట కుదిర్చాడు భగవంతుడు ...నాకు వాళ్లింటిలోనే ఎక్కువ కాలక్షేపం!''

షర్టు విప్పి హేంగర్‌కు తగిలించాడు.

రేఖ వంటగదివైపు వెళ్లిపోయింది. మాధవరావుగారు బట్టలు మార్చుకొని గది లోనికెళ్లాడు, రేఖ ఎంతకూ రాకపోవడంతో. రేఖ గదిలో కనబడలేదు. పెరట్లోకివెళ్లాడు. కొళాయి దగ్గరున్న సిమెంటు బెంచీమీద కూర్చొని సీరియస్‌గా వుంది! అంతలోనే ఆమె అలా ఎందుకు అయిపోయిందో మాధవరావుకు అవగాహన కాలేదు......

''ఇక్కడేం చేస్తున్నావ్?'' అంటూ సమీపించి చుబుకం మీద చెయివేసి మొహం ఎత్తాడు... కన్నీరు కారుస్తోంది!

''ఏమిటి రేఖా! ఏడుస్తున్నావా?'' అయోమయంగా అడిగాడు.

''ఏమండీ! ఒక్క విషయం అడుగుతాను నిజం చెప్పండి!'' ఏడుపు దిగమింగుకుంటూ అడిగింది.

''అంటే ఇప్పటివరకూ నేను చెప్పినవన్నీ అబద్ధాలేనా?'' ఎదురు ప్రశ్న వేశాడు.

''అదికాదు. నే నడగబోయేదానికి అబద్ధం చెప్పాల్సిన అగత్యం వస్తుందేమోనని భయం''

''నిస్సందేహంగా అడుగు'' అన్నాడు ఆమె పక్కనే సర్దుకొని కూర్చొంటూ ...

''మీకు త్రాగుడు అలవాటు లేదా?''

''చంపావ్ పో! అదా నీ భయం!'' తేలిగ్గా కొట్టిపారేసి నవ్వాడు.

''జవాబు చెప్పారు కాదు!'' సీరియస్‌గానే అడిగింది......

''లేదు! రేఖా! నీకాభయం అక్కరలేదు! ఇదివరకు ఎప్పుడూ చవిచూడలేదు! ఇక ముందు కూడా అలా జరగదు'' చేయి పట్టుకుని హామీ యిచ్చాడు.

## చక్రాలు నడుస్తాయి

రష్యాలో లెనిన్‌గ్రాడ్ మెకానికల్ విద్యా సంస్థకు చెందిన ఇంజనీర్లు ఎం. ఎం. గార్బెషోక్, వి రమనోవ్‌లు నడిచే చక్రాలను డిజైన్ చేశారు. ఈ పరికరాన్ని అమర్చిన వాహనం జారుడు ప్రదేశాలలోనూ, అస్థిరము లయిన నేలలమీదా సులభంగా ప్రయాణిస్తుంది. రోడ్డుమీద కష్టమైన ప్రదేశం వచ్చేసరికి చక్రాలు తిరగడం మానేస్తాయి. ఆ ప్రదేశాన్ని వాహనం నడిచి దాటేస్తుంది.

"మరి మీ ఎక్కవుంటెంటు అలా ఎందు కడిగాడు."

"ఏమని"

"నీవూ వస్తావా అని!"

"ఓహ్ అదా!... శంకరాన్కి బాస్ దగ్గర చనువు ఎక్కువ ... అదీ కాకుండా బార్సుకుకూడా కలసి వెళ్తూ ఉంటారు... కనుక స్నేహం ఎక్కువ. నాకా మధ్య ప్రమోషన్ ఇప్పిస్తానన్నారు. ఆ విషయం అడుగుతానన్నాడు. నేను వస్తానన్నాను. కానీ ఎందుకో ఈ రోజు వెళ్లబుద్ధి కాలేదు! వెళ్లలేదు! ఇంకా నయం! వెళ్లిఉంటే నీ అనుమానం ధృవపడి మహా వృక్షమై పోయి ఉండేది!"

చేయి పట్టుకొని లేవదీసాడు...

సంతృప్తిగా లేచింది రేఖ.

* * *

మర్నాడు ఎక్కవుంటెంటు శంకరమే భార్యా సమేతంగా వచ్చేసాడు ... శంకరం భార్య లలితకూడా శంకరంలానే కలుపుగోరు మనిషి!... మంచి కంపెనియే అనుకొంది రేఖ! రేఖను తీరుబడిగా ఉన్నప్పుడు, ఏమీ తోచనప్పుడు, తప్పకుండా వస్తుండమని చెప్పింది లలిత... మర్నాడు మధ్యాహ్నం లలిత యింటికి వెళ్లింది రేఖ. లలితకు ఇద్దరు పిల్లలు... కాన్వెంటులో చదువులు! పుదయం పోయి సాయంత్రం వస్తారు!... ఇల్లు అంతా శుభ్రంగా ఉంది. ఫర్నిచర్ బాగా సర్ది ఉంది... చాలా బావుందని అనుకొంది మనసులో రేఖ.

"ఏమండీ! ఇలాంటి సీసాలు చాలా ఉన్నట్లున్నాయి మా కొకటి యిద్దురూ!" అడిగింది చేతిలోకి ఓ ఖాళీ సీసా తీసుకుని.

"అలాంటి సీసాలకు మాకేమీ కొదువ లేదు వదినగారూ! కావలిస్తే ఒకటి కాదు రెండు తీసుకెళ్లండి, అది సరే! యిలాంటి సీసాలు మీ యింట్లో ఒకటీ లేదా?" ఆశ్చర్యంగా అడిగింది లలిత.

"అసలివేం సీసాలండి?" అమాయకంగా అడిగింది రేఖ.

"ఇవి బ్రాందీ సీసాలు!" అంది తేలిగ్గా.

షాక్ తిన్నట్లయింది రేఖ.

"మాధవరావుగారికి ఇలాంటి అలవాట్లు లేవని మీతో చెప్పారా?"

"అంటే! ఆయన తాగుతారా?"

"అహా! నాకు తెలియదనుకోండి! మరి మా వారూ మీవారూ ఫ్రెండ్స్ కదా! సహ

## పెళ్ళినాడు

వాస దోషం తగలకుండా ఉంటుందా అని అడుగుతున్నాను. వారి ఆఫీసులో నెలకు ఒక్కసారి అయినా పార్టీ ఉంటుందట! అలాంటి పార్టీలలో డ్రింక్స్ తప్పనిసరిగా ఉంటాయట. డ్రింక్స్ లేకపోతే అసలు పార్టీయే కాదట, మా వారు అప్పుడప్పుడు అంటూ వుంటారు."

ఇహ వినలేకపోయింది రేఖ! ...

"మరలావస్తానండీ! మరచిపోయా! స్టౌమీద పాలుపెట్టి వచ్చేసాను" అంటూ బయటకు వచ్చేసింది.

* * *

"ఏమండీ నిజంగా చెప్పండి! మీకు "ఆ" అలవాటు లేదా?" ... ఏడుస్తూ అడిగింది.

"ఏమిటి రేఖా! నీ పిచ్చి! అనుమానం జబ్బు బాగా పట్టినట్టుంది!... తాగే వాళ్లంటే ఎందుకంత భయం"...

"భయంకాదు అసహ్యం!"

"నీకా భయం అక్కర్లేదు! అసహ్యం అసలే వద్దు! నేను చెబుతున్నాగా!




నా కలాంటి ఫ్రెండ్సు చాలా మంది వున్నారు ... అయినా నేను ఎప్పుడూ రుచి కూడా ఎరుగను నీ మీద వొట్టు వేయమంటావా?"

"ఒద్దులెండి! నాకా నమ్మక ముంది!" అంది సంతృప్తిగా.

మరుసటి రోజు ఆఫీసుకెళ్తూ

"రేఖా! ఈ రోజు రాత్రి ఆలస్యంగా వస్తాను. ఆఫీసులో పార్టీ వుంది... నాకోసం చూడకుండా భోంచేసి పడుకో!"

"వేగంగా రావాలి సుమండీ!...... నిద్ర పోకుండా మీ కోసం ఎదురు చూస్తూ కూర్చొంటాను!"

* * *

రాత్రి ఏడుగంటలయింది. ఆకలవుతున్నది గాని తినబుద్ధి కాలేదు. అయినా ఎనిమిది గంటలవరకూ చూసింది. ఇంకా మాధవరావు రాలేదు. అప్పుడులేచి భోజనమయిందనిపించుకొని వచ్చి పడుకొంది.

రాత్రి తొమ్మిది గంటలయింది. యింకా నిద్ర రాలేదు. మాధవరావు రాలేదు. రేఖకు భయం అధిక మవసాగింది. ఆ భయంతోనే మగతగా నిద్రపోయింది.

మంచి నిద్రలో ఉండగా తలుపు చప్పుడయింది. ఖంగారుగా రేఖ లేచి తలుపు తీసి చూసింది. బయట నిలబడ్డ మనిషిని చూసి ముందు భయం వేసినా ధైర్యం చిక్కబట్టుకొని,

"ఎవరు? ఏం కావాలి?" అని అడిగింది.

"బాబుగారు!... అంటూ నసిగాడు అవతల మనిషి.

"బాబుగారు లేరు!" అని చెప్పి తలుపు వేయబోయింది.

"బాబుగారికోసం రాలేదమ్మా! ఆయన రిక్షాలో వున్నారు!" అన్నాడు.

"ఎక్కడా! రిక్షాలోనా!" అంటూ ఆశ్చర్యంగా వేయబోయిన తలుపును తీసింది.

"మీరుకూడా వస్తే తోడుబెట్టుకొని తీసుకు రావొచ్చు! కొంచెం నిషాలో వున్నట్లున్నారు." అన్నాడు.

ఆ మాట వింటూనే రేఖ తల తిరిగిపోయింది. అయినా కర్తవ్యం గుర్తుకువచ్చి బయట రిక్షాలో ఉన్న మాధవరావును అతి కష్టంమీద ఇంటిలోనికి చేర్చగలిగారిద్దరూ.

అతనిని మంచం మీద పడుకొండబెట్టి తలుపు వేయటానికి వచ్చింది. బయట ఇంకా అక్కడే నిలబడ్డ రిక్షావాడ్ని చూసి,

"ఇంకా నిలుచుకున్నావేం?" అని అడిగింది.

"డబ్బులిప్పించండమ్మా!" అడిగాడు.

అతనికి ఇవ్వవలసిన డబ్బు యిచ్చి పంపించి తలుపులు మూసింది. "ఇదంతా కలా! నిజమా!" అని అనుకోసాగింది. తిరిగి మాధవరావు పడుకొన్న మంచం దగ్గరకు వస్తూ అతన్ని చూసింది. ఏవేవో మాట్లాడుతున్నాడు. ఒక్కటీ తన కర్థంకాలేదు. అతను అర్థంలేని మాటలాడుతున్న కొలది రేఖకు ఏడుపు అధికమవ సాగింది. అలానే అతని గుండెపై తలపెట్టుకొని ఏడ్వసాగింది.

కొంత సేపు పోయాక అమె కన్నీళ్లు చూడలేని మాధవరావు.

"రేఖా!" అని సహజధోరణిలో పిలిచాడు.

అదిరిపడి లేచింది రేఖ.

_ "ఏమండీ! పిలిచారా?" అతను

# ఆస్టర్‌మిల్క్
## తల్లిప్రేమలాగే ప్రియమైనది



**ఆస్టర్ మిల్క్—గ్లాక్సో (యు.కె.) వారి పరిశోధనా ఫలితమైన ఉత్పాదన—ప్రపంచమంతటా, తల్లులందరూ విశ్వసించే, <u>పరిపూర్ణమైన పిల్లల ఆహారం.</u>**

ఆస్టర్ మిల్క్, పిప్పి పళ్ళు, బాల్యగ్రహం అనే పిల్లల జబ్బు రాకుండా విటమిన్ 'డి' (అస్టెలిన్)తో సమృద్ధి చేయబడి, పిల్లల కోసం ప్రత్యేకంగా రూపొందించబడిన ఆహారం. ఆస్టర్ మిల్క్ బలమైన, పటిష్టమైన ఎముకలు, గట్టి పళ్ళు, మంచి కండనూ పెంపొందిస్తుంది.

అందుకే తెలివైన తల్లులు పిల్లల ఆహారం విషయంలో ఏమాత్రం పొరపాటు పడరు. వాళ్ళు ఎప్పుడూ నమ్మేది—ఆస్టర్ మిల్క్.



ఆస్టర్‌మిల్క్—
ప్రపంచంలోని తల్లులంతా
విశ్వసిస్తారు.

Interpub GL/1/75 Tel

# సామాన్యుని సణుగుడు

ప(త్రికలుచూస్తే 'పండగ తగ్గింపు' ధరల ప్రకటనలే కనపడుతాయి. కొన్ని గొప్ప తగ్గింపు ధరలు. మరి కొన్ని కనీ వినీ ఎరుగని తగ్గింపు ధరలూ... పెద్ద పెద్ద ప్రకటనలు వార్తలు చదవబుద్దేయదు. యీ బట్టల ప్రకటనసలు చదువుతుంటే శ్రావణ మాసం ముందు ఆషాడ మాసం కనుక తగ్గింపుధరలంటారు. శ్రావణ మాసంలో శ్రావణమాసం కనుక పాతికనుంచి ముప్పయి శాతం తగ్గింపు ధరలు, రంజాన్‌కి, వినాయక చవితికి, దసరాకి, దీపావళికి, నాగులు చవితికి ప్రతి పండుగకీ యీ తగ్గింపు ధరల పెద్ద పెద్ద బోర్డులు ప్రకటనలు మనకి ప్రత్యక్షమవుతూ వుంటాయి! నిజంగా యీ ప్రకటనలుచూస్తే వో వందో అరవందో అప్పో సప్పోచేసి దుకాణానికి పరిగెట్టాలనిపిస్తుంది.. అంతేనా... రిక్షాలమీద లౌడ్‌స్పీకరులు పెట్టి ధరలు తగ్గించేశాం రండహో అని చెవులు చిల్లులు పడేలా గోల... ఇక దుకాణాలముందు తోరణాలు...పెద్ద పెద్ద ద్వారబంధాలు...చేనేత వస్త్రాలనే వాడుడు. మిల్లు దుస్తులనే తొడుగుడు అని పోటీపడే బ్యానర్‌లు వీటికితోడు హైరోడ్డుమీద, నిమిషానికో లారీ క్షణానికో బస్సుపోయే పబ్లిక్ రస్తాలో నాలుగేసి లౌడ్ స్పీకర్‌లు...అందులోనుంచి "ఎత్తమంటావా... నన్ను ఎత్తుకుంటావా ?" అంటూ కత్తుల రత్తయ్యమీద జ్యోతిలక్ష్మి సవాల్‌చేసేపాటలు.. అప్టూడేట్ తారాశశాంకం రికార్డుల సెట్ పాటలూ ఇదంతీ వరస...దాందుంపతెగిరి ఎంత తగ్గింపు ధరలైతే మాత్రం ఇంతగోలెందుకండీ బాబూ... తీరా దుకాణాల్లోకి వెళ్లామా?... "కస్టమర్ కర్టసీ" అంటేనే పరువు తక్కువ అనుకునే మన పవిత్ర భారత దేశంలో నడిచి దుకాణంలోకి వెళ్లే మనల్ని చూసే దెవరు ? సరుకు చూపించేదేవరు? మనం ఏ రకం చూపించి తీయమన్నా సరే ? దాని మీద రిబేటు లేదు... కొంటూ నుంటే తీస్తాం అని మనకేసి కాకుండా గోడ కేసిజవాబు చెప్పేస్తారక్కడిఅమ్మడో అబ్బాయో ఎవరైన ఒకటే తీరులెండి... నాకారునెంబర్ ఏ. వి. డి., ఫైవ్‌పోర్ త్రీటూ, మా ఇంట్లో ఫ్రిజుడ్డైరుంది...అల్సేషన్ కుక్కవుంది.. ఎయిర్ కండిషన్డ్ రూమూ వుందీ నాకు స్మగిల్డ్ రిస్టు వాచీ వుందీ అంటూ గట్టిగా కోసేసి—సేల్స్‌మన్ లేక సేల్స్‌గర్ల్స్‌ని దబాయించి నాలుగు రకాలు చూద్దామనుకున్నా నోరుపెగల్దు. పెగిలినా ఆ రికార్డుల రోదలో మనం చెప్పే నిజమే ఎవరూ నమ్మరు అబద్ధాలెవరు వింటారు. ఏరకం మీదా తగ్గించని వాళ్ళు మనకి అక్కరలేని రకాలమీద మాత్రం తగ్గించేస్తారు. ఈ రిడక్షన్‌కోసం అక్కర లేని ఆ గుడ్డలు ఎలా కొనుక్కొని ధరిస్తాం చెప్పండీ! చౌక డిపోలు సూపర్‌బజార్‌లు, రిడక్షన్ కవుంటర్‌లూఎన్ని వున్నా ముందు మనక్కావల్సింది 'కస్టమర్ కర్టసీ'—అది లేనిచోట మనం గంటలతరబడి నిలబడి బతిమాలి ఏవస్తు

(44వ పేజీ చూడండి)

# పెళ్ళినాడు

మామూలుగా మాట్లాడుతున్నాడన్న సంతోషంతో.

"అరె! ఎందుకేడుస్తున్నావ్ ?" అన్నాడు ఆమె ముఖం చూసి.

"అహా! నా బ్రతుక్కి ఏడవక ఏం చెయ్యమన్నారు. మీరు చేసిన ఘనకార్యం ఎంత గొప్పదో అని!" అంటూ మళ్లీ ఏడ్వ సాగింది.

"అబ్బబ్బ! అలా ఏడిస్తే నాకేం తెలుస్తుంది. అసలు జరిగిన విషయం చెప్పు ?" అన్నాడు ఏమీ తెలియనట్లు అమాయకంగా ముఖంపెడ్తూ.

అలా అమాయకంగా పెట్టిన ముఖాన్ని ఇంకోసారయితే ముద్దు పెట్టుకొనుండేది. కాని ఇప్పుడు అందుకు వ్యతిరేకంగా ఆమెకు అతనిపై కోపం వచ్చింది. "చేసిన పని చేసి ఏమీ ఎరగనట్లు ముఖం పెడ్తున్నారు. అబ్బ ఎంతకయినా తగినవారు!" అని మనసులో అనుకొంది.

ఆమెకు కోపం అధికమవుతుండడం గమనించిన మాధవరావు మాట మారుస్తూ

"టైమెంతయింది?" అని అడిగాడు.

రేఖ లేచి టైము చూచి

"ఐదూనలభై"అని చెప్పింది.

అంటే తెల్లవారుతోందన్నమాట అంటూ స్వగతంగా అనుకొని

"ఈరోజు ఏం వారం!" అనడిగాడు.

రేఖ విస్తుపోతూ "ఏమిటీ! మతిగాని పోలేదుగదా. ఏం వారం అని అడుగుతున్నారేమిటి ?" అని మనసులో అనుకొని

"మంగళవారం"

"ఇది ఎన్నో సంవత్సరం?"మళ్ళీఅడిగాడు

రేఖ చిరాకుపడుతూ కోపంగా

"1975 అంతర్జాతీయ మహిళా....."

అంటుండగా మాధవరావు అందుకొని

"అబ్బ కోపంలో కూడా చాలా అందంగా వుంటావుసుమీ!"

దానికి రేఖ అదే ధోరణిలో

"ఇప్పుడు నా అందం మాట అలా వుంచండి. ముందు మీ అందం చూసుకోండి తెలుస్తుంది."

"అబ్బ! ఇంకా కోపం పోలేదా!" అన్నాడు మళ్లీ అమాయకంగా

"కోపమా! మీ మీదా! నా కెందుకుంటుంది? అసలు మిమ్మల్ని కోప్పడడానికి నాకసలు అధికారముంటేగా!" అంది విరక్తి చెందినట్లుగా.

"ఏమిటీ! అధికారం లేదా! ఇప్పుడేగదా అన్నావు ఇది అంతర్జాతీయ మహిళా సంవత్సరమని. అంటే స్త్రీలకు కూడా పురుషుడితో సమానహక్కు ఉండాలనేకదా నీ అభిప్రాయం! అటువంటప్పుడు నీకు అధికారమెందుకుండదు"

విరక్తి ధోరణిలోనే మాట్లాడుతూ రేఖ "అందరూ నోటితో మాట్లాడేవారేనండీ ఆచరణలో పెట్టే ది బహు తక్కువ" అంది.

ఆమె ధోరణి తర్కంలోనికి దిగుతుంటే ఇక లాభంలేదనుకొని.

"ఇది 1975 వ సంవత్సరం కదూ!" అన్నాడు మళ్లీ.

రేఖ దానికి జవాబియ్యలేదు.

"తారీఖెంత ?"

"ముప్పయిఒకటి" అని జవాబిచ్చింది.

"ఏమండోయ్ శ్రీమతిగారు మీరింకా ముప్పయిఒకటిలోనే ఉన్నారా! అది నిన్నటి తారీఖు ఇప్పుడు తెల్లవారింది. అంటే ఈ రోజు తారీఖు ఒకటి తెలిసిందా!"

దానికి రేఖ ఒక నిమిషం ఆలోచించి హఠాత్తుగా "అంటే!"

"అంటే? ఏమిటి" అన్నాడు ఏమీ ఎరగనట్లుగా.

"అమ్మ దొంగా ఈరోజు ఏప్రెల్ ఫస్టు కదూ! అయితే నన్ను ఏప్రిల్ ఫూల్‌ను చేశారన్నమాట" అంది అతని ముఖం దగ్గర తన ముఖం పెడ్తూ.

"హమ్మయ్య! ఇప్పటి కర్థమయిందన్నమాట! మన పెళ్లయిన మొదటి ఏప్రిల్ ఫూల్ నువ్వే అంటూ వెక్కిరించాడు" దానికి బదులుగా.

"చూడండి! మళ్లీ సంవత్సరం ఏప్రిల్ ఫూల్ మీరే" అంటూ తనూ వెక్కిరించింది.

ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

దేశసంపదను

ప్రభోదాత్మక చిత్రం!

పూర్ణిమాపిక్చర్సువారి

# దేవుడులాంటి మనిషి

ఈస్ట్మన్ కలర్








దర్శకత్వం:
సి.యస్.రావు B.A.(UTT.)

నిర్మాత:
డి.యస్.రాజు

సంగీతం: కె.వి.మహదేవన్

# వారఫలం

## 21-11-1975 శుక్రవారంమొదలు
## 27-11-1975 గురువారం వరకు

**మేషం:—** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృషభం:—** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాలలో మీ కృషి రాణిస్తుంది. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగించగలదు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మిధునం:—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు —కుటుంబ కార్యక్రమాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకుంటారు.

**కర్కాటకం:—** మీ తాలూకుమనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభించగలదు.

**సింహం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య :—** వ్యాపారంలో ముఖ్యమయిన వ్యక్తులను కలుసుకుంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**తుల:—** రావలసిన డబ్బు అందుతుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :—** ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. దైవకార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు :—** మీ ప్రయత్నాలు నెరవేరతాయి నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమయిన వ్యయం జరగుతుంది.

**మకరం :—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో చికాకులకు గురి కాగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

**కుంభం :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. భాగస్వాములతో చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మీనం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు నెరవేరతాయి.

—మహేష్

# రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

గోడలు కట్టలేవు ఇసుక బెందడితో
నిర్మించలేవు మహాభవనాలు
కారు మూగక్రతో
పేలపిండి వంటి పదాలతో
ఝుళిపించలేవు భీషణాయుధం

# సీరియల్

# శ్రావణసంధ్య

తెళ్ళూరు నాగేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

శాంతి నీరుకారిపోయింది.

"మీ రెలాగైనా ఉద్యోగం ఇప్పించాలండీ ! లేకపోతే మా కుటుంబ పరిస్థితి మరీ హీనమై పోతుంది. ఈ కాలంలో ఆర్థికమైన ఆసరా లేకపోతే బ్రతుకు బజారు కుక్కకంటె నికృష్టమైంది అవుతుంది. మా వార్ని విధి ఏ విధంగా శిక్షించిందో మీకు తెలియంది కాదు. మాకు వెనక ఎవరూ అండగా లేరు. మా కాళ్లమీద మేమే నిలబడాలి. మా కన్నీటిని మేమే తుడుచుకోవాలి. ఆయనకు సంపాదించే శక్తి లేదు. అమ్మాయా చిన్నది. నేనే సంపాదించి, సంసారాన్ని నెట్టుకురావాలి. దయవుంచి, మీరేదైనా ఉపాధి కల్పిస్తే, మా సంసారం నిలబడుతుంది. లేకుంటే బజారు పాలవుతుంది. మిమ్మల్ని అర్థిస్తున్నాను." దీనాతిదీనంగా అంది శాంతి. ఆమె దృష్టిలో తనకు ఉద్యోగం ఇచ్చే దయాస్వభావుడు అంతకంటె ఎవరూ గోచరించ లేదు.

"నేనేం చేసేది శాంతీ ! చూస్తున్నావుగా — నేను పడే శ్రమ ! నీకు ఏదో సహాయం చేయాలనే సదుద్దేశం లేకపోతే నిన్ను నా రూమ్‌లోకి రానిచ్చేవాణ్నా ?... ఆలోచిస్తున్నాను." అన్నాడు రఘునాథ్ సిగిరెట్టు వెలిగిస్తూ.

"మీరేమైనా ఆలోచించండి. నాకు ఉద్యోగ భిక్ష పెట్టండి" అంది శాంతి ఆత్మాభిమానాన్ని చంపుకొని.

**జరిగిన కథ 5 :** ప్రేమించి పెళ్లి చేసుకున్న రాంమ్మోహన్, శాంతిల అనురాగ ఫలం నీలిమ. ఎంతో వైభవంగా ఏడవ వెడ్డింగ్ యానివర్సరీ జరుపుకుంటారు. స్కూటర్ ప్రమాదంలో కాలూ, చేయీ పోగొట్టుకుంటాడు రాంమ్మోహన్. ఆర్థిక ఇబ్బందుల్లోకూడా పూర్వంలాగా జరగాలనే రాంమ్మోహన్ మనస్తత్వం మరింత బాధిస్తుంది శాంతిని. రాంమ్మోహన్ పని చేసిన కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు రఘునాథ్ ఉద్యోగాన్నిస్తాడన్న తృప్తితో ఇల్లు చేరిన శాంతి తన భర్తకు తిరిగి త్రాగుడు అలవాటు చేస్తున్న బావ రాజారామ్‌ను చీదరిస్తుంది.

"రేపు ఓసారి రా ! ఈ రాత్రికి ఆలోచించి, ఏదో ఒక జాబ్‌ను క్రియేట్ చేస్తాను. నీ దీనావస్థను చూస్తూంటే నా హృదయం ద్రవించిపోతోంది. స్త్రీ కంటి కన్నీరుకు నా గుండె కరిగిపోతుంది. ఎంత రిస్క్ అయినా స్వీకరిస్తాను" అన్నాడు రఘునాథ్.

మళ్లీ శాంతి మనస్సులో ఆశలు కొత్త చిగుళ్లు తొడిగాయి. కొంచెం ధీమాగానే ఇంటి కెళ్లింది.

ఆ మరునాడు మళ్లీ వొచ్చింది శాంతి. అప్పటికే ఆఫీసు మేనేజరు రఘునాథ్‌తో ఏవో మంతనాలు జరుపుతున్నాడు. ఇద్దరికీ నమస్కారం చేసి, కుర్చీలో కూర్చుంది శాంతి.

"సరే, అలాగే చేయ్ !" అన్నాడు రఘునాథ్ మేనేజరుతో. "యస్సార్ !" అంటూ వెళ్లాడు మేనేజరు.

"శాంతీ ! టెంపరరీగా ఒక క్లర్క్ పోస్టు క్రియేట్‌చేసి, అందులో నిన్ను వేస్తున్నాం. అపాయింట్‌మెంట్ ఆర్డరు మేనేజరు యిస్తాడు. తీసుకో. రేపే వచ్చి జాయిన్‌కా. రేపట్నుంచీ జీతం వస్తుంది. మొదట్లో అలవెన్సులూ అన్నీ కలుపుకుని నాలుగొందల యిరవైదాకా వస్తాయి." అన్నాడు రఘునాథ్.

శాంతి మనస్సు సంతోషసాగరమైంది. రెండు చేతులూ ఎత్తి దణ్ణంపెట్టింది కృతజ్ఞతాపూర్వకంగా.

"మీరు నిజంగా నా విషయంలో శ్రమతీసుకొని, ఎంతో సహాయం చేశారు. మీ మేలు నా జన్మలో మర్చిపోను."

"టెంపరరీగా క్లర్క్‌గా వేశానుగానీ, కొంతకాలం పోయాక మంచి పోస్టు చూస్తాను."

"థ్యాంక్స్ అండీ."

చిరునవ్వు నవ్వుకున్నాడు రఘునాథ్—మనస్సులోనే.

శాంతి గదిలోంచి బయటకు వెడుతూంటె, ఆమె జఘన సౌందర్యానికి ముగ్ధుడై కొన్ని క్షణాలపాటు కనురెప్పలు మూయలేదు రఘునాథ్.

## 13

కంపెనీకి శాంతి వరసాగ్గా నాలుగురోజులు వెళ్లింది. అయినా ఆమె ఉద్యోగం ఇతమిత్థంగా తేలలేదు. అనుక్షణమూ ఆమె ఆశా నిరాశల మధ్య, మొక్కనున్న ఆఖరి ఆకులాగా వ్రేలాడుతోంది. ఉద్యోగం కచ్చితంగా వస్తుందన్న విశ్వాసమూ లేదు; రాదన్న నమ్మకమూ లేదు.

తనకు ఏదో ఒక ఉద్యోగాన్ని యిప్పించడానికి రఘునాథ్ పడుతూన్న శ్రమను శాంతి కళ్లారా చూస్తూనేవుంది. అయితే కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ అయివుండీ, రోజువారీ అడ్మినిస్ట్రేషన్‌ను ఆయనే చూస్తూకూడా ఒక గుమాస్తా ఉద్యోగానికి యింత గుంజాటన పడాలా ? అన్న సందేహం ఆమెకు కలక్కపోలేదు. అయినా ఎవరి ఇబ్బందులు వారికి వుంటాయని సరిపెట్టుకుంది.

ఒకరోజు శాంతి సమక్షంలోనే ఆఫీసు మేనేజర్ను పిల్చి అడిగాడు రఘునాథ్.

"మన ఆఫీసులో గుమాస్తా పోస్టులు ఖాళీగా ఏమీ లేవా ?"

"లేవు సార్. ఆమధ్యనే ఒక అటెండర్ పోస్టును ఒక మంత్రిగారి రికమెండేషన్ మీద సృష్టించి, భర్తీచేశాం."

"ఎరన్డ్ లీవులో ఎవ్వరూ పోలేదా ?"

"లేదు సార్."

నుదురుమీద అరచేయి పెట్టుకొని ఒక నిముషంపాటు దీర్ఘంగా ఆలోచించాడు రఘునాథ్.

"ప్రొడక్షన్ డిపార్ట్‌మెంట్‌లో ఖాళీలు ఉండవచ్చుసార్ ! వర్క్స్ మేనేజర్ని అడిగితే ఇన్‌ఫర్మేషన్ తెలుస్తుంది సార్ !"

"ఉప్పు సంగతి అడిగితే ఉల్లిపాయ సంగతి మాటాడతావేమయ్యా ! ఒక లేడీకి మనం ఉద్యోగం యివ్వాలి. ఏదైనా డిపార్ట్‌మెంట్‌లో ఏ పోస్టు అయినా ఖాళీగా వుందేమో చూడు."

"ఎక్కడా ఖాళీలేదు సార్ ! యిప్పటికే ముగ్గురు పనిచేసేచోట అయిదుగురు పని చేస్తున్నారనీ, దానితో కొంతమంది పనీ పాటా లేక గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటున్నారనీ, అడ్మినిస్ట్రేషన్ ఖర్చు అంచనాలకు మించి అధికంగా అవుతూన్నదనీ ఆమధ్య డైరక్టర్ల బోర్డువారు వ్యాఖ్యానించడం జరిగిందండీ !"

"ఓ. యస్. యస్ ఇప్పుడు మనం కొత్తగా ఓ గుమాస్తా ఉద్యోగం సృష్టించినా, సవాలక్ష ప్రశ్నలకు సమాధానాలు చెప్పకోవాలన్న మాట ! అదో ఇబ్బంది వచ్చి పడిందన్నమాట."

"అవును సార్ ! వ్యయకర్తన చర్యలను తూ. చ. తప్పకుండా అమలుజరపమని బోర్డువారి తీర్మానం తాటకాయంత అక్షరాలతో వుంది సార్ !"

"సరే. యు కెన్ గో"

ముక్కు పుటాలు ఎగురవేస్తూ ఆఫీసు మేనేజరు వెళ్లాడు.

శాంతి గుండెలో మునిమాపులా ప్రవేశించిన మసక చీకటి అమావాస్య చీకటైంది — నిరాశ తీవ్రతతో.

'ప్రత్యక్షంగా చూశావుగా పరిస్థితిని' అన్నట్టు కనుబొమలు ఆడిస్తూ చూశాడు రఘునాథ్ ఆమెకేసి.

## 14

తాత్కాలికంగా శాంతికి డిస్పాచ్ సెక్షన్‌లో సీట్‌ను వేశారు. వారంరోజులుగా ఆ సెక్షన్‌లోనే వుంది. రోజు రోజుకూ క్రమేపీ ఆఫీసునూ, ఆఫీసు

రోని పనినీ, మనుషుల్నీ, మనస్తత్వాల్నీ కుణ్ణంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నది.

ఆరోజు పగలు పన్నెండుగంటలకు డిస్పాచ్ రిజిష్టర్‌లో ఎంట్రీలు వ్రాస్తూండగా, ప్యూన్ వచ్చి శాంతితో అన్నాడు.

''పెద్దయ్యగారు రమ్మంటున్నారండీ !''

శాంతి వెంటనే మేనేజింగ్ డైరక్టర్ రూమ్ లోకి వెళ్ళింది, స్ప్రింగ్ డోర్ తెరుచుకుని.

అది ఎయిర్‌కండిషన్డ్ రూమ్. విశాలమైంది. రూమంతా ఖరీదైన కార్పెట్‌తో కప్పబడి వుంది. విండో పక్కన పెద్ద డెవలప్ టేబుల్. ఆ టేబుల్ ముందు గోద్రేజ్ ఎగ్జిక్యూటివ్ చైర్. అందులో రఘునాథ్ కూర్చుంటాడు. ఎదురుగ్గా ఓ అరడజన్ కుషన్ చైర్స్. కొంచెం దూరంగా యూఫోమ్ సోఫాసెట్టు. గ్లాస్‌విండోలకు అందమైన కర్టెన్లు. గోడలకు అక్కడక్కడా మోడరన్ ఆర్ట్ పీస్‌ల క్యాబినెట్లు. ఓమూల బుక్ షెల్ఫ్. మరోమూల స్టీల్ ఆల్‌మైరా. అత్యాధునికంగా వుంది ఆ రూమ్.

''పిల్చారట.''

''కూర్చో.''

కూర్చుంది శాంతి. ఆమెకేసి ప్రశాంతంగా చూశాడు రఘునాథ్. ఫుల్‌వాయిల్ ప్రింటెడ్ శారీ ధరించింది. జీవితంలో స్థిరపడిన ప్రశాంతత ఆమె మొహంలో స్పష్టంగా గోచరిస్తోంది. ఆతని చూపును భరించలేకపోయింది. వెంటనే మొహం



పక్కకుతిప్పి, గోడమీద ఓ ఇంజనీరింగ్ కంపెనీ కేలండర్‌కేసి చూడసాగింది.

''ఎలావుంది జాబ్ ?''

''బాగానే వుందండి.''

''జాబ్ చేయడం జీవితంలో యిదే మొదటి సారా ?''

''అవునండీ. మీ దయవల్ల నాకు ఈమాత్రం జీవితాధారమైనా దొరికింది.''

''ఇందులో నాదయ ఏముంది? మీ మొహంలో వ్యాకులపాటూ, అయోమయమూ, జీవితంపట్ల భయమూ చూడగానే నాకు జాలివేసింది...అదంతా అటుండనివ్వు. ఇప్పుడెందుకు పిలిపించానంటే...?''

''చెప్పండి.''

''నీలాంటి క్వాలిఫైడ్ వాళ్ళకు ఆ సెక్షన్ సరైందికాదు. కొన్నాళ్లపాటు సెక్షన్ మారుద్దామనుకుంటున్నాను.''

''ఎక్కడకు మారుస్తారు ?''

''ఇక్కడికే !''

''అంటే !''

''నాదగ్గరికే. నా పర్సనల్ అసిస్టెంట్‌గా జ్యోతి వుండేది. ముందు గదిలో కూర్చునేది. చూసేవుంటావు. తెల్లగా, కొంచెం లావుగా, ఎత్తుగా వుండేది. మళయాళం ముడి చుట్టుకొనేది...''

''అవును. చూశాను.''

''ఆమె రెండుమాసాలు సెలవుపెట్టింది. ఆమె ప్లేస్‌లో రెండు నెలలపాటు నువ్వు పని చేయాలి. నీ వర్క్ నచ్చితే ఇక్కడే నువ్వు కంటిన్యూ కావచ్చు. జీతం ఆరొందలుదాకా వుంటుంది.''

''మరి నాకు టైపూ,షార్ట్‌హ్యాండూరావండీ!''

''ఫర్వాలేదు. టైపు చేయడానికి వేరే టైపిస్టులు వున్నారు. ఏదైనా డిక్టేట్ చేస్తే లాంగ్ హ్యాండ్‌తోనైనా రాసుకోవచ్చు.''

''అయితే మీ యిష్టం.'' శాంతి సంతోషంగా ఒప్పుకొంది.

ఆ రోజునుంచే శాంతి మేనేజింగ్ డైరెక్టరు గారి పర్సనల్ అసిస్టెంట్‌గా వ్యవహరించసాగింది. సాయంకాలం ఇంటికెళ్లగానే ఆ మార్పును గురించి భర్తతో చెప్పింది శాంతి.

''రఘునాథ్ చాలా మంచివాడు శాంతీ ! ఉద్యోగులపట్ల ఉదారంగా, కలుపుగోలుగా, అభిమానంగా వుంటాడు. ఆయన మేనేజింగ్ డైరెక్టర్ అయింతర్వాత కంపెనీ ఎంతో అభివృద్ధిలోకి వచ్చింది. లాభాలు మూడింతలైనాయి. అదే రేటులో బోనస్‌లుకూడా ఇస్తున్నారు. అందుకే ఆయనంటే స్టాఫ్ పడిఛస్తారు — మిడిల్ మేనేజ్‌మెంట్ లెవల్ నుంచి లోయర్ మేనేజ్‌మెంట్ లెవల్‌దాకా. వర్కర్స్‌కు కూడా ఆయన దేవుడితో సమానమే ! కొన్నాళ్లపోతే నీకే తెలుస్తుంది ఆయన మంచితనం'' అన్నాడు రాంమ్మోహన్.

## *15*

పర్సనల్ అసిస్టెంట్‌గా మారిన మూడో రోజున మధ్యాహ్నం ఇంటర్‌వెల్ టైంలో శాంతిని

గదిలోకి పిలిపించాడు రఘునాథ్. నర్సన్న వచ్చి పిల్చాడు. నర్సన్న నమ్మినబంటు అతనికి.

శాంతి వెంటనే వెళ్లింది.

గదిలోకి ఆమె రాగానే రఘునాథ్ ఆమెకేసి చూసిన చూపుకు శాంతికి ఎందుకో భయంవేసింది. ''కూర్చో'' అనగానే ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

దాదాపు మధ్యాహ్నం ఒంటిగంట నుంచీ, మూడు గంటల వరకూ ఆయన గదిలోకి ఎవరూ రారు. అది ఆయన లంచ్ అయింతర్వాత విశ్రాంతి తీసుకొనే సమయం. డోర్ వద్ద నర్సన్న ఉండి ఎవ్వర్నీ లోపలకు రానివ్వడు. ఆ సమయంలో ఫోన్స్ కూడా రావు. వచ్చినా ఆపరేటర్ కనెక్షన్ ఇవ్వడు — ఒక్క లీలామణి నుంచి వస్తే తప్ప.

''శాంతీ! ఈ కంపెనీలో నేను ఈ పొజిషన్‌లో ఉండటానికి కారణం ఎవరనుకున్నావ్?''

శాంతి నోరు విప్పలేదు.

''మా ఆవిడ లీలామణి. ఆ మాట కొస్తే నేను ఇంతవాడ్ని కావటానికి మా ఆవిడే మూల హేతువు. అంటే మా ఆవిడ దగ్గరున్న డబ్బు మహాత్యం. నేను ఒకప్పుడు కడు బీదవాణ్ణి, ఎంత బీదవాణ్ణి అంటే వారాలు చేసుకొని బందర్లో బి. కాం. చదివాను. నిత్య దారిద్ర్యపు నికృష్ట జీవితాన్ని అనుభవించాను. అలాంటివాణ్ణి కోటీశ్వరుడు కూతురైన మా ఆవిడకు మొగుడ్ని అయ్యానంటే అదొక ఎడ్వంచర్. ఎడ్వంచర్ చేయందే జీవితంలో 'థ్రిల్' లేదు. ఆ ఎడ్వంచర్‌కు మూల కారణం ఆనాడు నేను తీసుకున్న నిర్ణయం ఆ నిర్ణయం వల్లనే నా జీవిత పథం మారిపోయింది. మా ఆవిడ్ని చూసేవుంటావు.''

తల ఆడించింది శాంతి.

''నల్లగా, లావుగా, గున్న ఏనుగులాగా వుంటుంది. అలాంటి ఆవిడకు అందమైన భర్త కావాలి. ఆస్తి అక్కర్లేదు. ఐశ్వర్యం అక్కర్లేదు. అందమే కావాలి. ఆ ఒక్క క్వాలిఫికేషన్‌తో ఆవిడ భర్తగా వచ్చి, కొన్ని లక్షలకు అధికారినై, ఈ స్థితిలో వున్నాను. జీవితంలో ఇంత ఎడ్వంచర్ ఎందుకు చేశానంటావ్?''

ఏమో అన్నట్టు చూసింది శాంతి.

''ఆ మాత్రం తెల్సుకోలేవా! దారిద్ర్యానికి భయపడి ధనవంతుల జీవితాల్లోని సుఖాలనూ, సర్దాలనూ అనుభవించాలని. ప్రేమ, అనురాగం, ఆనందం, దాంపత్య సుఖం — వీటికి ప్రాధాన్యాన్ని ఇవ్వకుండా కేవలం డబ్బుకు ప్రాముఖ్యమిచ్చి — ఇంతవాడ్ని అయ్యాను. ఇదంతా నీకు ఎందుకు చెబుతున్నానో నీకు తెలుసా?''

తెలియదన్నట్టు కింది పెదవి విరిచింది శాంతి.

''నువ్వు చక్కనిదానివేగానీ, నీ బుర్ర చురుకైంది కాదు శాంతీ! నీలో ఆకర్షణ శక్తి ఎక్కువ. గ్రహణ శక్తి తక్కువ. నిన్ను చూసిన ప్రథమ వీక్షణంలోనే నా హృదయంలో అవ్యక్తమైన ఆత్మీయత ఏర్పడింది. అంచేత సొంత కబుర్లు టూకీగా, నిర్మొహమాటంగా చెబుతున్నాను. అసలు విషయమేమిటంటే —''

ఏమిటన్నట్టు ఆసక్తిగా చూసింది శాంతి.

''మా ఆవిడ లీలామణి ఎప్పుడైనా ఫోన్ చేసి అడిగితే నీ పేరు 'జ్యోతి' అని చెప్పు. జ్యోతి ఒక మోస్తరు అందమైందే అయినా, మా ఆవిడ మెప్పును ఎల్లాగో పొందింది. ఒక రోజు ఇంటికి పిల్చి, ఆవిడ మంచితనాన్ని పొగిడి, పసుపూ కుంకుమతో ఓ కంచి పట్టుచీర పెట్టి, ఆవిడ ఆశీర్వాదాన్ని పొందిందట. నీ అసలు పేరు పొరపాటునైనా చెప్పావంటే — నీ ఉద్యోగం వూడుతుంది. నా పరువూ, పలుకుబడీ పల్చబడిపోతాయి. ఆ రోజు మా ఇంటిదగ్గర చూశావుగా — నీమీద ఆవిడకు ఎంత కక్షో! ఆ కక్షతో ఆవిడ ఏమైనా చేయొచ్చు. కేవలం సొంత బాధ్యతా, రిస్కు మీదనే నీకు ఉద్యోగం యిచ్చాను. ఏమంటావ్?''

''నిజమేనండీ! మీ మంచితనంవల్లనే నాకు జీవనాధారం లభించింది.''

''లేదు శాంతీ! నేను లోకం అనుకొనేటంత, మెచ్చుకుంటూన్నంత మంచివాడ్ని కాదు. ఏదో సామెత చెబుతారే! లోకంలో అందరికీ మంచి చేసేవాడు పుట్టకుండానే పోయాడట. లోకంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క బలహీనత వుంటుంది. నాకూ అలాంటిదే వుంది. దానికి అతీతంగా వ్యవహరించడం అసాధ్యము. నీకు ఉద్యోగం యివ్వడంలో, నీగురించి హృదయంలో జాలి ఏర్పడడంలో నాలో కొంత స్వార్థం లేకపోలేదు. ఆ స్వార్థ ప్రేరణతోనే నీకు ఈ ఆఫీసులో చోటిచ్చాను. ఆ స్వార్థమేమిటో నీనుంచి నేను ఆశించిందేమిటో స్పష్టంగా చెబుతాను.''

**త్వరలో**
**'మనుగడలో మలుపులు'**

శాంతి గుండె ఒక్కసారిగా దిమ్మెక్కింది. ఆ స్వార్థమేమిటో నన్న భయం ఆమె నరనరాల్లో వ్యాపించింది.

''బయటినుంచి చూసేవాళ్లకు నా బతుకు సుఖప్రదమైందిగా కనబడుతుంది. పెద్ద లిమిటెడ్ కంపెనీకి మేనేజింగ్ డైరక్టర్ను. మూడు తరాల వరకూ తరగని ఆస్తి వుంది. ఆస్తికీ, అంతస్తుకూ తగిన భవంతిలో వుంటున్నాను. ఆ భవంతిలోపల వాస్తవంగా ఏం జరుగుతూందో ఎవరికీ తెలియదు. అది నా ఆంతరంగిక జీవితం. నరకప్రాయమైంది. బాహాటంగా కనబడేది కృత్రిమమైంది. అది స్వర్గంతో సమానమైంది. ఈ స్వర్గ నరకాలూ రెండూ నా వర్తమాన జీవితంలో జంటకొమ్మలవలె వున్నాయి. నా దాంపత్య జీవితం కొరగాని బీడు వంటిది. పైకి పచ్చగానే కనబడుతుంది. కాని అందులో వున్నవన్నీ పిచ్చిమొక్కలూ, నాగజెముళ్లూ, తుమ్మముళ్లూ. ఫలవంతమైందికాదు. అందులో ఒక ఆనందం లేదు; అనుభూతి లేదు; అనుభవం లేదు. జీవితంలో 'స్మృతి'గా మిగుల్చుకొనేది రవ్వంతకూడా లేదు. ఈ డబ్బూ, హోదా, కార్లూ, కంపెనీ, మేడలూ, పేరుప్రతిష్టలూ, నలుగురితో 'మంచివాడు' అనిపించుకోవటాలూ — వీటి వెనుక ప్రాణికి అవసరమైన సంతృప్తీ, సుఖమూ వున్నాయి. వాటికోసమే యిన్నాళ్లుగా, యిన్నేళ్లుగా అహర్నిశమూ అన్వేషణ జరుపుతున్నాను. ఈ అన్వేషణ యీనాటికి ఫలించింది. అంటే యిప్పటికి నా అదృష్టం పండిందన్నమాట.''

సంక్షోభచిత్తయై చూసింది శాంతి.

''ఈ లోకంలో ఏదీ 'ఇలాగే జరగాలి' అని నిర్దేశించడం జరగలేదు. జరిగినా వాటిని మనుషులు స్వార్థంకోసమో, సుఖంకోసమో, తెగింపుతోనో అతిక్రమిస్తున్నారు. అంతమాత్రంచేత లోకానికి ముప్పు ఏమీ వాటిల్లటంలేదు. సూర్యచంద్రులు గతులు తప్పడంలేదు. అంతా యథాతథంగానే గడిచిపోతూన్నది. ఈ సాంఘికమైన కట్టుబాట్లూ, విలువలూ కృత్రిమమైనవి. కొంతమంది మనుషులు పరిమితమైన సుఖాపేక్షలను ఆశించి సృష్టించినవి. నిజమైన సుఖాన్ని కోరుకొనేవాళ్లు వాటిని ఖాతరు చేయరు. నేనుకూడా అంతే! శాంతీ! ఒక స్త్రీకి ఒక మగవాడు సహాయంచేస్తే అది ఆమెను ఒక రకంగా ప్రేమించినట్లే అవుతుంది. హృదయమూ, మనస్సూ ఆమెను ఎప్పుడూ మర్చిపోలేవు. ఆమె పట్ల ఎంత ఎక్కువగా శ్రద్ధ చూపిస్తే ఆమెపట్ల అభిమానమూ, ఆకర్షణా అంత ఎక్కువగా పెరుగుతాయి. నీ విషయంలో నా మనస్థితి అలాగే వుంది. ఏమంటావ్?''

ఏమిటో అంతా అగమ్యంగా వుంది శాంతికి. అతనేం మాట్లాడుతున్నాడో, తాను ఏం మాట్లాడాలో అయోమయంగా వుంది. అయితే ఏదో కీడును మనస్సు పసికట్టకపోలేదు. అందుకే గుండెలో దడ జాస్తి కాజొచ్చింది. అవ్యక్తమైన భయంతో శరీరమంతా అదోరకంగా అవుతూన్నది. ఊహించని పరిణామమేదో మేరుపర్వతంలా పడదోసుకు వస్తూన్నట్టుంది.

''మీరేం మాట్లాడుతున్నారో నాకు తెలియడం లేదు'' అంది శాంతి అయోమయంగా.

''నీలాంటి తెలివిగలదానికీ, చదువుకున్నదానికీ, సంసార స్త్రీకీ అరటిపండు వొలిచి అరిచేతిలో పెట్టినట్టు విడమర్చి చెప్పాలా? ఆమాత్రం గ్రహించలేవా? నాచేత మోడుగా చెప్పించాలనా? అయితే చెబుతాను. నేను వ్యాపారస్తుడ్ని. మతమూ, శాస్త్రమూ ఎలాంటిదో వ్యాపారంకూడా అలాంటిదే. దానికి ప్రేమా, ద్వేషమూ లేవు. వ్యాపారస్తుడు కూడా నిర్మొహమాటంగానే మాట్లాడతాడు. అంతా బిజినెస్ లైక్‌గానే ఉండాలి. శాంతీ! నీ రూపలావణ్యాలు నా మనస్సును బంధించివేయ్. నిజం చెబుతున్నాను. నా సుఖాన్వేషణకు చరమదశవే నువ్వు. నీ పొందు ద్వారా ఆశించిన సుఖాన్నీ, సంతృప్తినీ పొందాలనుకుంటున్నాను. నీకూ, నీ కుటుంబానికీ ఆర్థికంగా ఏ లోటూ రానివ్వను. అంతా రహస్యంగా జరిగిపోతుంది. ఏమంటావ్?''

రఘునాథ్ వెల్లడించిన కోర్కెకు మొదట్లో శాంతి కొయ్యబారిపోయింది. క్రమేపీ స్పర్శజ్ఞానంలోకి వచ్చింది. అప్పుడామెలో కోపమూ, జుగుప్సా, న్యూనతా ముప్పేడలా ఉబికివచ్చి, ఆడపులిలా లేచింది.

''మిస్టర్ రఘునాథ్! ఇప్పటికైనా మీ అసలు రంగును బయటపెట్టారు. థ్యాంక్స్! నే నెవర్ని అనుకుంటున్నారు? డబ్బు కోసం వొళ్లు అమ్ముకొనే నీచురాల్ని అనుకున్నారా? నా ఆర్థిక దుస్థితిని ఆసరాగా తీసుకొని, నన్ను లోబర్చుకోవాలని చూస్తున్నారా? అదెన్నటికీ జరగదు. కాలవశాన నేను

## సినిమా విశేషాలు

### ప్రకాశరావు చిత్రారంభం

భాను భట్టాచార్య, రుషీకేష్ ముఖర్జీ, గుల్జార్ నిర్మించే చిత్రాలను బోలిన రియలిస్టిక్ కథను గొన్న చిత్రాన్ని, విఖ్యాత దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు ప్రారంభించారు

వాస్తవికత వుట్టిపడే సంఘటనల హారమే మోడల్ ప్రొడక్షన్స్ తలపెట్టిన తొలి ప్రయత్నం.

కె ఎస్ పి. దర్శకత్వాన్ని, ఆచార్య ఆత్రేయ రచనా సారథ్యాన్ని, పెండ్యాల సంగీత విభాగాన్ని, మోహన కళను, కోటగిరి గోపాలరావు కూర్పును, కె ఎస్. ప్రకాష్ ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్న నిజాన్ని ప్రకాష్ స్టుడియోలో అక్టోబరు ఆరున ఆరంభం రోజు చూశాను.

'అగ్రనటి' వాణిశ్రీ నాయికగా, 'రెబల్‌స్టార్' కృష్ణంరాజు నాయకుడుగా నటించ, సహాయ పాత్రలను సత్యనారాయణ, జయంతి, రాజబాబు, రమాప్రభ, గిరిజ, అల్లు రామలింగయ్య మరియు రావు గోపాలరావు పోషిస్తున్నారు. నిర్మాత కె కృష్ణమోహనరావు.



← "పాడి పంటలు"లో జయమాలిని

### విఠలాచార్యగారి మరో జానపదం

"కోటలో పాగా" చిత్రాన్ని చూచిన వ్యక్తులు, జానపదంలో "బ్రహ్మ" ఆచార్య ఒక్కరేనని చెప్పారు.

ఆయన్ను అభినందించడానికి వెళ్లిన సమయాన, మరో జానపద కథను గూర్చి వివరించారు.

మంత్ర తంత్ర యుక్తమైన విచిత్రమైన సంఘటనలు నిండిన జానపదాన్ని తలపెట్టారు

"కోటలో పాగా" చిత్రంలో నటించిన నటీ నటులతోబాటు, మరి కొందరు తన కొత్త కలర్ జానపదంలో వుండగలరని విఠలాచార్య చెప్పారు

### "నటసామ్రాట్" చిత్రం

"నటసామ్రాట్" నాగేశ్వరరావుగారితో ఒక వుత్తమ సాంఘిక కథను తీసే వుద్దేశ్యం తనకున్నట్లు చెప్పి, ఆయన మహానటుడు మాత్రమేగాక మహా మనీషి కూడా అని ప్రశంసించారు.

తను ఎందరితో చిత్రాలు నిర్మించినా, తన మనసును విశేషంగా ఆకర్షించిన నటుడు నాగేశ్వర రావుగారు మాత్రమే అన్నారు, ఆచార్య.

అక్కినేనిగారికి కూడా విఠలాచార్యపట్ల వున్నత అభిప్రాయం వున్న నిజాన్ని, ఆయనకు వెల్లడించాను.

## శ్రావణ సంధ్య

మీ దగ్గరకు ఉద్యోగం కోసం రావచ్చు. అంత మాత్రంచేత చులకనగా చూడకండి మాకు సమాజంలో పరువూ, మర్యాదలున్నాయి ఆర్థిక ఇబ్బందులకు గురై, నాలుగు యిళ్లల్లో అడుక్కొచ్చి అయినా భర్తనూ, కూతుర్నీ పోషించుకోగలనుగానీ, ఇలాంటి గోముఖ వ్యాఘ్రాలకు నీతినీ, న్యాయాన్నీ, అమ్మి — కట్టుకొన్న భర్తకు అపచారం చేయను అపవిత్రురాలిగా మారను. గుర్తుంచుకోండి! మీ ఉద్యోగానికి ఓ నమస్కారం" అంటూ వెళ్లబోయింది శాంతి.

"శాంతీ! ఒక్కనిముషం! అభిమానవతియైన సంసార స్త్రీ నుంచి ఇలాంటి ప్రతిఘటన వస్తుందని నేను వూహించకపోలేదు. ఆవేశపు పొంగు చల్లారగానే ఆలోచించుకో. టైం యిస్తున్నాను నీకిష్టమైతే రెండ్రోజుల తర్వాత రా. లేకపోతే, మళ్లీ యీ కంపెనీ ఆఫీసు గడప తొక్కనక్కర్లేదు మెరుపులా వచ్చి, మెరుపులాగానే వెళ్లిపోయావనుకుంటాను నా జీవిత డైరీలోంచి ఆ కాగితాన్ని తొలగిస్తాను. అంతే! చెప్పానుగా నేను బిజినెస్ మాన్‌ను అని" అన్నాడు రఘునాథ్ సిగిరెట్టు వెలిగిస్తూ

అతనికేసి తీవ్రంగా మూడు క్షణాలపాటు చూసింది శాంతి ఆ చూపులో అంతులేని కసి, జుగుప్సా, అసహనం, అవమానం కొట్టవచ్చినట్టుగా కనిపించినాయి శరీరమంతా వొణికిపోయింది 'నమిలి మింగివేద్దామా?' అన్నంత ఆవేశం మొహంలో నెట్టుకొచ్చింది ఏమీ చేయలేక, ఏమాటా నోటినుంచి పెగలక గబగబా బయటి కొచ్చింది స్ప్రింగ్ డోర్ తెరుచుకొని

*16*

ఆఫీసునుంచి బయటపడ్డ శాంతికి ప్రపంచమంతా అసహ్యంగా, స్వార్థపూరితంగా, ఇరుగ్గా, మురికిగా కనబడింది సిటీబస్సులో కూర్చున్నదన్న మాటేగానీ మస్తిష్కమంతా మొద్దుబారిపోయింది ఏ ఆలోచనా క్రమంగా ఒక రూపాన్ని ఏర్పర్చుకొని, ముందుకు సాగటంలేదు. ఆలోచించుకొన్నకొద్దీ మనస్సు ఆవేశంతో, ఆశ్చర్యంతో మెలికలుతిరిగి పోతున్నది.

'ఇట్లా ఎందుకు జరిగింది?' 'తన ప్రవర్తనలో ఏదైనా లోపముందా?' 'లోకం నైజమే అంతేనా?' 'ఆర్థికంగా కష్టాల్లో వున్న స్త్రీకి సహాయం చేసే పురుషుల మనస్సుల్లో ఇలాంటి స్వార్థమే వుంటుందా?' మొదలైన ప్రశ్నలతో ఆమె మనస్సు చిక్కుబడిన దారపు వుండలా తయారైంది

బస్సు దిగి నేరుగా ఇంటికొచ్చింది శాంతి అప్పుడు మధ్యాహ్నం ఒకటిన్నరైంది. ఆ టైంలో శాంతి ఆఫీసు నుంచి ఇంటికి రావడం రాంమ్మోహన్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది

"అదేమిటి శాంతీ! అప్పుడే వచ్చేశావ్? ఆఫీసుకు సెలవా?" అన్నాడురాంమ్మోహన్‌ఆదుర్దాగా

కనురెప్పల మధ్య నీళ్లతో భర్తకేసి చూసింది శాంతి ఉద్విగ్నచిత్తయై.

మాట్లాడకుండా మంచంమీద బోర్లా వాలింది రాంమ్మోహన్‌లో ఆవేదన జాస్తి అయింది

"అప్పుడే వచ్చావేం మమ్మీ!" అంటూ నీలిమ తల్లి దగ్గరకు వచ్చింది

"ఏమైంది శాంతీ!" అన్నాడు రాంమ్మోహన్ కాస్త గొంతు పెంచి

ఏం కావాలి? కాకూడనిదే అయింది కాని కాలం వస్తే ఇలాంటి అనర్థాలు ఎన్నో కాళ్లకు చుట్టుకుంటాయి

"తల నొప్పిగా వుందండీ! సెలవు అడిగి వచ్చాను" అంటూ అబద్ధమాడింది శాంతి దిండులో మొహందూర్చి మెరమెరలాడే దుఃఖంతో జలజలరాలే కన్నీటితో దిండు తడిచిపోయింది. ఆ కన్నీటిని భర్త కళ్లనుంచిదాయాలని ఒకపక్క సతమతమవుతూంది.

"తిండీతిప్పలూ మానేసి మాకోసం కష్టపడుతూంటే, తలనొప్పి రాదూ మరి! నీ ప్రాణానికి మేం గుదిబండలుగా తయారైనామాయె — మూడు పూటలూ తింటానికి నీలూ! ఆ రేడియో టేబుల్‌మీద ఆస్ప్రో బిళ్ల వుందేమో చూడు." అన్నాడు రాంమ్మోహన్.

"నాకిప్పుడు ఏ బిళ్లా వొద్దండీ! కొంచెం సేపు విశ్రాంతిగా పడుకొంటే అదే తగ్గిపోతుంది. మీరేమీ గాబరాపడకండి" అంది శాంతి.

"నువ్వు అల్లాగే అంటావు శాంతీ! గొంతు మీదకు వచ్చేదాకా నీకేమీ తెలీదు. నువ్వు మంచాన పడ్డావంటె, మా కంచాల్లో యింత వండివేసే వాళ్లు ఎవ్వరూ లేరు నా బాధ అదే. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవే అని మొదట్నుంచీ మొత్తుకుంటున్నా మధ్యాహ్నంపూట ఏమీ తినవాయె. కాఫీగూడా తాగవాయె!"

"మీ రూరుకోండి. నన్ను కాస్త రెస్టు తీసుకోనివ్వండి"

"అమృతాంజనమైనా రాసుకొని పడుకో! పదినిముషాల్లోతగ్గుతుంది ఆల్‌మరాలో ఉంటుంది"

"ఏమీ అక్కర్లేదులెండి. అదే తగ్గుతుంది."

"నీది మరీ చాదస్తం శాంతీ! తలనొప్పి దానంతటకు అదే ఎలా తగ్గుతుంది? — ఏదైనా మందు వేయకపోతేతప్ప ఆరోగ్యాన్ని గురించి బొత్తిగా ఖాతరుచేయవు. మూలబడితేగానీ తెల్సిరాదు" అన్నాడు రాంమ్మోహన్ కోపంగా

శాంతి వినిపించుకోలేదు కళ్లు మూసుకొని నిశ్శబ్దంగా పడుకొంది ఆలోచనలమీద ఆలోచనలు వచ్చి, అలసటతో నిద్రకొరిగింది మనస్సులో మల్లగుల్లాలు పడడం మినహా రాంమ్మోహన్ ఏమీ మాట్లాడలేదు (ఇంకా వుంది)

శ్రీ విజయభట్ ప్రొడక్షన్సు

# గుణవంతుడు

ఈస్ట్మన్ కలర్



దర్శకుడు

ఆదుర్తి సుబ్బారావు

నిర్మాతలు

యన్.యన్. భట్ - యన్.యస్. మూర్తి

సంగీతం: కె.వి. మహదేవన్ • మాటలు: సత్యానంద్

అన్నపూర్ణా ఫిలింస్

శ్రీ విజయభట్ ప్రొడక్షన్సు

# గుణవంతుడు




అన్నపూర్ణా ఫిలింస్



"వింతఇల్లు–సంతగోల"లో ఒక దృశ్యం

# సినిమా

## కలిసి నటించడం భావ్యమా?

మీరు, రామారావుగారు కలిసి నటించే శుభ దినం రాదా అని ప్రశ్నించాను

"మేమిద్దరం కలిసి పదకొండు చిత్రాలలో నటించాం. మా యిద్దరిమధ్య అవాంఛనీయమైన బేదాభిప్రాయాలు కొన్నేండ్లు వచ్చాయి

మళ్లీ మేమిద్దరం అన్నదమ్ములవలె ప్రేమాను రాగాలతో వుంటున్నాము. మా సఖ్యత, స్నేహం వర్ధిల్లాలంటె కలిసి నటించడం మానెయ్యాలి

ఒకే చిత్రంలో యిద్దరు నటించినప్పుడు, ఏ ఒక్కరిది చిన్న వేషమయినా, అభిమానులు ఆగ్రహిస్తారు

ఇద్దరినీ లక్షలాది ప్రేక్షకులు మూడు దశాబ్దాల నుంచి అభిమానిస్తున్నారు. వారి అభిమానాన్ని ఆగ్రహంగా మార్చడం మంచిదికాదు", అన్నారు అక్కినేని

## రామకృష్ణకు అభినందన

బెంగుళూరు చాముండేశ్వరి స్టుడియోలో "క్షేత్రయ్య" షూటింగు జరుగుతూంది నాలుగు షెడ్యూళ్ల ప్రతిఫలంగా వచ్చిన పదకొండు రీళ్ల చిత్రాన్ని నాగేశ్వరరావుగారు, అంజలీదేవి, సి ఎస్. రావ్, స్వామిగార్లు చూచారు

రషస్ చూచివచ్చిన అక్కినేనిగారిని రామకృష్ణ వాయిస్‌ను గూర్చి అడిగాను

"చాలా చక్కగా పదాలను ఆలాపించాడు నాకు సరిపడేవిధంగా రామకృష్ణ పాడాడు అయ్ విష్ హిమ్ ఆల్ ది బెస్ట్", అంటూ అభినందించారు.

"నటసామ్రాట్"కు రామకృష్ణ వాయిస్ మాత్రమే సరిపోతుంది అనేది అధిక సంఖ్యాకుల తీర్పును అక్కినేని అంగీకరిస్తున్నారు గానుక, నిర్మాతలు అలాగే ఆచరించగలరు.

## అక్కినేని క్షేత్రాటన

"మహాకవి క్షేత్రయ్య"గా నటిస్తున్న అక్కినేని నవంబరు నెలలో క్షేత్రాటన చెయ్యడానికి సంకల్పించారు

ఆయన పర్యటించే క్షేత్రాలు చిదంబరం, మధురై, కాంచీపురం

వేణుగోపాలుని ఆదేశానుసారంగా సిద్ధేంద్ర యోగి ఆశీర్వచనము బడసి "మువ్వ" కోసం క్షేత్రయ్య దేశాటనం చెయ్యడం జరిగింది

వాగ్గేయకారుడు, కవి, రసికుడు, పదప్రవక్తగా "నటసామ్రాట్" నవరసభరితమైన నటన్ను ప్రదర్శిస్తున్న నిజాన్ని ప్రేక్షకులు ప్రశంసించగలరు

సి ఎస్ రావుగారి రూపకల్పనలో, ఆదినారాయణరావుగారి సంగీత లాలనలో, స్వామిగారి ఛాయాగ్రహణ పాలనలో, ఆరుద్రగారి రచనా రాజ్యంలో "క్షేత్రయ్య" మధుర చిత్ర కావ్యంగా తయారవుతున్న నిజాన్ని ప్రజలు మెచ్చగలరు

## రాజేశ్వరి పిక్చర్స్!

"రాముని మించిన రాముడు" చిత్రాన్ని యిద్దరు నిర్మించారు ఒకరి పేరు భక్తవత్సలం మరొకరి పేరు గోపీనాథ్

ఇద్దరికీ ఆ చిత్రం లాభాలు తెచ్చిపెట్టింది. భాగస్వాములు విడిపోయారు.

ఇద్దరిలో ఒకరయిన గోపీనాథ్ రాజేశ్వరీ పిక్చర్స్ అనేడి చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించారు

రాజేశ్వరీ చిత్రం నిర్మించబూనిన సాంఘిక చిత్రానికి తమిళ కథా రచయిత ఆర్ కె ధర్మరాజు ఒక చక్కని యితివృత్తాన్ని వినిపించారు

కథను విన్న తరువాత చిత్రానికి "మహాత్ముడు" తప్ప మరొక మకుటం సరైనది కాదని నేను చెప్పాను

నిర్మాత–దర్శకుడు గోపీనాథ్, కథా రచయిత ధర్మరాజు, మరొక వ్యక్తి బెంగుళూరుకు వెళ్లారు అక్కడ "క్షేత్రయ్య" షూటింగుకోసం బసచేసిన హీరోను కలిసి, "మహాత్ముడు" కథను వినిపించడం జరిగింది

"నటసామ్రాట్" "మహాత్ముడు"గా నటించడానికి సమ్మతించారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిత మయ్యే "మహాత్ముడు" చిత్రానికి డి. వి నరసరాజు సంభాషణలను రాస్తారు

గోపీనాథ్‌కు నాగేశ్వరరావుగారితో చిత్రం నిర్మించాలన్న కోరిక అప్పుడప్పుడు కలలో జనించేదట ఆ కల అక్టోబరు యిరవైనాలుగున నిజమయ్యింది అదృష్టవంతుడు గోపీనాథ్



"దొంగల్లో మొనగాడు"లో శివాజీ, మంజుల



''కోటలో పాగా''లో రాజబాబు, జయమాలిని

## సినిమా

### స్వర్గానికి నిచ్చెనలు

సంసార జీవితంలో స్వర్గానికి నిచ్చెనలు వేయడం ఎలాగో కొందరతివలకే తెలుస్తుంది కొందరు స్త్రీలు సంసారంలో సంభవించే చిన్న చిన్న సమస్యలను సహనంతో సంబాళించుకోలేక కల్పనలను సృష్టించుకుని, కలతలను పెంచుకుని, సంసార జీవితాన్ని నరకప్రాయం చేసుకుంటారు భర్త ఎంతటి దుష్టుడైనా, పరుల ఎదుట అతన్ని దూషించదు, మరొకరు దూషించినా సహించదు నిజమైన స్త్రీ సర్వకాల సర్వావస్థలయందు భర్తను తన గుప్పిట్లో పెట్టుకోవాలని పుబలాటపడుతుంది మరో మగువ

అన్నపూర్ణ భర్త నిజానికి దుర్మార్గుడు, దుర్గుణవంతుడు. కానీ తన భర్త తనకు దైవమని, తనంటే అతనికి ప్రాణమని స్నేహితురాలు జయలక్ష్మితో చెబుతుంది అన్నపూర్ణ కానీ అన్నపూర్ణ భర్త నిజస్వరూపాన్ని కళ్లారా చూచిన జయలక్ష్మి, అలాంటి భర్తతో కాపురం చేయడం కన్నా, విడాకు లిచ్చేయడమే మంచిదని సలహా చెబుతుంది అన్నపూర్ణకు కానీ అన్నపూర్ణకు జయహితవు నచ్చలేదు. సంసార సముద్రంలో పుత్పన్నమయ్యే సమస్యలను ఓర్పుతో జయించాలి అవసరపడితే అనవసరపు అవాంతరాలు వస్తాయి ఏదైనా సహనంతో సాధించాలిగానీ, తొందరపడితే సంఘర్షణలే ఎదురౌతాయి అని నచ్చచెబుతుంది అన్నపూర్ణ కానీ జయలక్ష్మి ఆ మాటలను పెడచెవిని పెట్టింది ఆ కారణంగా భర్తను దూరం చేసుకుంది. బాధలకు గురి అయింది. అన్నపూర్ణ ఓరిమితో తన జీవిత గమనాన్ని స్వర్గతుల్యం చేసుకుంటుంది జయలక్ష్మి, అన్నపూర్ణల మధ్య జరిగిన వివాదంవల్ల ఏర్పడిన సంఘటనలు ఏమిటి? వారిద్దరిలో ఎవరి మాట నిజమైంది? ఈ ప్రశ్నలకు సమాధానమే శ్రీ లక్ష్మి నరసింహా ఫిలింస్‌వారి ''స్వర్గం—నరకం'' బి రామ తారకం సమర్పించే ఈ చిత్రానికి మావుళ్ళయ్య, పి యస్ భాస్కరరావు నిర్మాతలు. దాసరి నారాయణ రావు కథ, మాటలు, స్క్రిన్‌ప్లే, దర్శకత్వం నెరపిన ఈ చిత్రానికి దిడ్డి శ్రీహరిరావు నిర్వహణ

### దశరథ తనయుడు!

దశరథ మహారాజాగా గుమ్మడి, ఆయన తనయుడుగా రామకృష్ణ నటిస్తున్న ''సీతా కళ్యాణం'' వర్ణ చిత్రాన్ని పింజల సుబ్బారావుగారి కుమారుడు ఆనందరావు తలపెట్టారు.

''సీతా కళ్యాణం'' వర్ణ చిత్రానికి బాపు (దర్శకత్వం), ముళ్లపూడి రమణ (రచన), మహదేవన్ (సంగీతం), కె. ఎస్. ప్రసాద్ (ఛాయా గ్రహణం), కుదరవల్లి (కళ) వంటి అతిరథ మహారథులు సాంకేతిక శాఖలకు ఆధిపత్యం వహిస్తున్నారు.

జనకరాజ పుత్రి జానకిగా జయప్రద నటిస్తున్నది ఇంతలోనే ఎంత మంచి పాత్ర లభించింది. బాగా రాణించి సెహభాష్ అనిపించుకోవాలి

దశరథుని ముగ్గురు భార్యలుగా జమునా, దేవిక, కృష్ణకుమారి నటిస్తున్నారు

స్వర్గీయ రంగారావుగారి స్థానాన్ని చాలావరకు భర్తీ చేస్తున్న సత్యనారాయణ ''సీతా కళ్యాణం'' చిత్రంలో రావణబ్రహ్మగా మరొక మరపురాని పాత్రను పోషిస్తున్నారు.

ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్ నిర్మిస్తున్న ''సీతా కళ్యాణం'' వర్ణ చిత్రం శ్రీరామనవమి పర్వ దినాన విడుదలవుతుంది.



''యవ్వనం కాటేసింది''లో కృష్ణంరాజు, జయచిత్ర

## కృష్ణంరాజుకు జయంతి ముద్ద

కృష్ణంరాజు జారిపడ్డాడు. చేతికి బలమైన గాయం తగిలింది. డాక్టర్ వచ్చి చికిత్స చేశాడు. విశ్రాంతి అవసరం అన్నాడు.

ఈలోగా జయంతి అన్నం తెచ్చింది

'కలపమంటారా ?'

'ఏం కూర' అడిగాడు కృష్ణంరాజు. 'ఏం కూర కావాలి' అని జయంతి ప్రశ్నించింది. 'అప్పే పూరికే అడిగాను. ఏ కూరయినా పర్వాలేదు' అని నసిగాడు రాజు

'నేను నమ్మను మీకు కొన్ని ప్రత్యేకమైన అభిరుచులున్నాయి అలాగే రుచులు కూడా వుంటాయ్' అంది జయంతి.

''అవసరాలతో అభిరుచులు, ఆకలితో రుచులు పోటీపడి నిలబడలేవు'' అంటూ కృష్ణంరాజు నిట్టూర్చాడు.

జయంతి అతనికి దగ్గరగా వెళ్ళి, అన్నం తినిపిస్తుంది. ''కట్'' అన్నారు దర్శకుడు బి ఎస్ నారాయణ. ఈ సహజ సన్నివేశం శుభ చిత్రాలయ వారి ''ఆడవాళ్ళు — అపనిందలు'' చిత్రంలో కనిపిస్తుంది ఈ చిత్రానికి హెచ్. కె. చంద్రశేఖర్ నిర్మాత. దాసం గోపాలకృష్ణ రచనాబలం యీ చిత్రంలో విజృంభించింది పూర్తైన విడుదల

## దాసరి పెట్టిన విచిత్రమైన పేరు

శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత పత్రికల్లో పేరు కోసం ప్రకటనలు చేశారు. పాఠకులు తెలిపిన పేర్లేవీ కథకు సరిపడలేదని నిర్ణయించారు. దర్శకుడు దాసరి పెట్టిన ''యవ్వనం కాటేసింది'' పేరును స్థిరపరిచారు

జయచిత్రకు తెలుగు మార్కెట్టును పెంచే పాత్ర యిందులో యివ్వబడింది తమిళంలో యిట్టి పాత్రలను ఎన్నో పోషించిన జయచిత్ర ''యవ్వనం కాటేసింది'' చిత్రంలో గడుసరి శిక్షణలో మరింత శోభించగలదు

కృష్ణంరాజు పాత్ర చిన్నదే అయినా, ప్రాధాన్యత వున్న వుత్తమ నాయకుడుగా చక్కగా నటిస్తున్నారు

తదితర పాత్రలను రావు గోపాలరావు, మురళీ మోహన్, గుమ్మడి, సావిత్రి పోషిస్తున్నారు

నిర్మాత రవీంద్రనాథ చౌదరికి, దాసరి దొరకడం యస్సెట్.

''యవ్వనం కాటేసింది'' చిత్రానికి చక్రవర్తి, కెరాధర్, కన్నప్ప, బాబు వరుసగా సంగీతాన్ని, కథను, ఛాయను, కూర్పును నిర్వహిస్తున్నారు

## విడివడని స్నేహం

నిర్మాత రవీంద్రకు, విజయబాపినీడుకు వున్న స్నేహం విడివడనిది ఇద్దరిదీ ఒకే మాట .. ఒకే నిర్ణయం దేహాలు వేరయినా, ఆత్మ ఒక్కటే అనేది భావాన్ని కలిగిస్తుంది, యిద్దరి ప్రవర్తన చూచినప్పుడు

లక్ష్మీ ఫిలింస్ ద్వారా గడుసరి చిత్రం రిలీజు కావడం యిదే ప్రథమం

కొత్తదనం వున్న చిత్రాలను ఆదరించే సంస్కారం ఆంధ్ర ప్రేక్షకులకు వుందిగాబట్టే, ''భారతంలో ఒక అమ్మాయి, దేవుడే దిగివస్తే'' చిత్రాలకు లాభాలు వచ్చాయి.

## చిట్టెమ్మ — చిలకమ్మ

పది + రెండు ఏండ్లు దర్శకత్వ శాఖలో పాఠాలు నేర్చిన పాలవరపు బ్రహ్మం యీ ఏడు మధ్యన దర్శకుడుగా పదవీస్వీకారం చేశాడు.

ఎన్. వి. సుబ్బరాజుగారి కథ ''చిట్టెమ్మ — చిలకమ్మ''ను చక్కటి చిత్రంగా బ్రహ్మం రూపొందించాడు

గత వారం ''చిట్టెమ్మ—చిలకమ్మ'' చిత్రాన్ని మిత్రులు, విమర్శకులు చూశారు.

ఒక ఉత్తమ స్త్రీని ముఖ్య పాత్రధారిణిగా పెట్టి, ఆమె ఎట్టి త్యాగాన్నయినా చెయ్యగలదు అని నిరూపించిన చిత్రమే ''చిట్టెమ్మ—చిలకమ్మ.''

చిత్రం చాలా నీట్‌గా వచ్చింది మెయిన్ కథ ఉత్సాహంగా, ఉద్రిక్తంగా నడిచింది ఎన్నో సన్నివేశాలు హృదయాన్ని స్పందిస్తాయి.



''సోగ్గాడు''లో ఒక దృశ్యం

## రావు నటన

చిత్రంలో మొదటి మార్కులు రావుగోపాలరావుగారికి యివ్వాలి ఆయన పలికిన ప్రతి పలుకును ప్రేక్షకులు కరతాళ ధ్వనులతో స్వీకరించగలరు పతాక సన్నివేశంలో రావుగారి నటన అద్భుతం

''చిట్టెమ్మ''గా నటించిన కె విజయ ఇంతటి సమర్థురాలా అని సంభ్రమించే విధంగా, నటించింది త్యాగానికి పర్యాయపదంగా భాసిల్లిన చిట్టెమ్మ పాత్రలో విజయ,తన పేరులోని అర్థాన్ని సాధించింది.

చిత్రంలో మురళీమోహన్‌ది నాయకుడి పాత్ర. ఆద్యంతం చక్కగా నటించాడు. సహాయ పాత్రలను గిరిబాబు, కె. వి చలం, సునందిని, గిరిజారాణి బాగానే పోషించారు.

అప్పలాచార్య మాటలు అప్పడాల రుచిని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణం చక్కదనాన్ని, సత్యం సంగీతం మాధుర్యాన్ని యిచ్చాయి

బ్రహ్మంకు దర్శకుడుగా నిలదొక్కుకునే అవకాశాన్ని ''చిట్టెమ్మ — చిలకమ్మ'' చిత్రం ప్రసాదించింది



''పూర్ణమ్మకథ''లో రోజారమణి

## విజయ కెన్ని చిత్రాలు ?

''చిట్టెమ్మ''గా చాలా చక్కగా నటించిన కె విజయను అభినందించడానికి ఆమె యింటికి వెళ్ళిన తరుణాన, ఒక తమిళ చిత్ర నిర్మాత కాల్‌షీట్లు కావాలని అడుగుతున్న విధాన్ని చూశాను.

ప్రస్తుతం ఆమె రెండు తమిళ చిత్రాలలో రెండవ కథానాయికగా నటిస్తున్నదట. మలయాళ భాషలో ఒక చిత్రంలో నటించిందట.

తనకు తెలుగు చిత్రాలలో నటించడమంటేనే యిష్టమట. పాత్ర ఎట్టిదయినా, అందులో వైవిధ్యం వుంటె చెయ్యడానికి తనకు ఎలాంటి అభ్యంతరము లేదట

ప్రస్తుతం విజయ నటిస్తున్న చిత్రాలు : ''పద్మశ్రీ పిక్చర్స్ వారి'' ''అందరూ బాగుండాలి'', మేఘాలయ మూవీస్ వారి ''ఇల్లు — వాకిలి'', ఎన్. వి ఎస్. వారి ''చిట్టెమ్మ—చిలకమ్మ'', శ్రీరాజ్ ఆర్ట్ కంబైన్స్ వారి ''రక్తపాశం'', జె జి ఫిలింస్ వారి ''పుణ్యంకొద్దీ పురుషుడు'', వెంగమాంబ మూవీస్ వారి ''జరుగుతున్న కథ'' చిత్రాలలో వెరైటీ పాత్రలను పోషిస్తున్నట్లు చెప్పింది విజయ.



''ఆడవాళ్ళు—అపనిందలు''లో నాగేశ్, జయభాను

# సినిమా

### సారంగధరుడుగా శోభన్ !

శోభన్‌బాబు ఏ పాత్రకయినా సరిపడే పర్సనాలిటీని పొందియున్నారు సాంఘిక, జానపద, పౌరాణిక పాత్రలకు శోభన్ రూపం ఎంతేని వుపకరిస్తుంది

విజయలక్ష్మి ఆర్ట్స్ పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న చిత్రంలో శోభన్‌బాబు సారంగధరుడుగా సాక్షాత్కరిస్తారు

చిత్రాంగిగా జయసుధ నటిస్తుంది సాంఘిక చిత్రంలో సారంగధరుడేమిటి అని ప్రశ్నించేవారికి, అదొక ''అంతర్నాటక దృశ్యం'' మాత్రమేనని తెలియ చేస్తున్నాను

''కృషీవలుడు'' టి కృష్ణ దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయారయ్యే విజయలక్ష్మి ఆర్ట్స్ పిక్చర్స్‌కు సత్యానంద్, మహదేవన్, కుదరవల్లి, జి కె రాము వంటి నిష్ణాతులు సహకరిస్తున్నారు

ప్రధాన పాత్రలను పోషిస్తున్న శోభన్, మంజుల, అంజలీదేవి, రోజారమణి, జయసుధ, రావు గోపాలరావు, రాజబాబు, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు ప్రజాదరణ పొందిన అనుభవజ్ఞులే.

టి త్రివిక్రమరావుగారు నిర్మిస్తున్న యీ వర్ణ చిత్రాన్ని లక్ష్మి ఫిలింస్ విడుదల చేస్తారు.

### బాబుల్‌నాథ్ రెండవ చిత్రం

''ఖయిదీ బాబాయ్'' చిత్రాన్ని నిర్మించి, ధనకీర్తులను ఆర్జించిన బాబుల్‌నాథ్ తన రెండవ చిత్రాన్ని త్వరలో ప్రారంభించే వార్తను, హైదరాబాద్‌లో నే కలిసినప్పుడు చెప్పారు

శోభన్‌బాబుగారెప్పుడు కాల్‌షీట్లు యిస్తారో, అప్పుడే చేద్దామనుకునే మనస్వి బాబుల్‌నాథ్‌కు బలే కథ దొరికింది

భాగ్యనగరం నివాసి రామస్వామిగా రిచ్చిన కథ, అందరికీ నచ్చే కథగా వుందని నిర్మాత అభిప్రాయం ఎంతవరకు సమంజసమో తెలుసుకుందామని, కథను గూర్చి చెప్పమన్నాను ఆయన టూకీగా చెప్పారు బాబుల్‌నాథ్ అన్నది నిజమే అనిపించింది

''హీ—మాన్' పాత్ర చుట్టూ కథ అల్లబడింది. ప్రతి కుటుంబంలో జరిగే సంఘటనలు, సమస్యలనుతీర్చే ఉత్తముడుగా శోభన్ పాత్రవున్నది

విజయలక్ష్మి ఆర్ట్స్ పిక్చర్స్ వారి చిత్రం పూర్తి అయ్యే తరుణాన, కృష్ణగారు బాబుల్‌నాథ్ గారి పనిలో నిమగ్నులవుతారు.

టెక్నికల్ శాఖలను కృష్ణ (దర్శకత్వం), మహదేవన్ (సంగీతం), సత్యానంద్ (రచన) నిర్వహించగలరని, లక్ష్మి ఫిలింస్ పంపిణీదారులని, బాలాజీ చిత్ర అధినేత చెప్పారు.

### దేవదాస్ ద్విపాత్రాభినయం

''ఓ సీత కథ'' చిత్రం ద్వారా స్వీట్‌విలన్ (దేవదాస్) పరిచయం అయ్యాడు పరిచయం చేసిన వ్యక్తి అసాధారణ ప్రజ్ఞావంతుడు (విశ్వనాథ్) గాబట్టి, దేవదాస్‌కు తొలి చిత్రం మేలు చేసింది

అగ్ర దర్శకుడు విశ్వనాథ్‌గారి రెండు చిత్రాలలో (సత్యచిత్ర, హేరంబ చిత్ర మందిర్) దేవదాస్ ప్రాముఖ్యత వున్న పాత్రలను పోషిస్తున్నారు ఈ మధ్య దేవదాస్‌గూర్చి మరొక శుభవార్త విన్నాను.

''అభిమానవంతులు'' చిత్రాన్ని అందించిన నరసింహారావుగారు నిర్మించనున్న ''దారి తప్పిన మనిషి'' చిత్రంలో దేవదాస్ ద్విపాత్రాభినయం చేస్తున్నారు

దేవదాస్‌కు తెలుగు చిత్ర జగతిలో ప్రత్యేక స్థానం తథ్యము

### అనువాద చిత్రాల జోరు

''కర్ణ'' చిత్రం పుష్కలంగా ధనార్జన చేసిన విజాన్ని ఎవరూ కాదనలేరు

ఇప్పుడు అనువాద చిత్రాల జోరు ఎక్కువగా కనిపిస్తుంది

''వీరమయూర, దొంగల్లో మొనగాడు, పెద్దమనిషి, మనసున్న మనిషి, కాశ్మీర్ బుల్లోడు'' మున్నగు డబ్బింగ్ చిత్రాలపైన తెలుగు నిర్మాతలు లక్షలు వెచ్చించియున్నారు

పై నుదహరించిన అనువాద చిత్రాల పట్టీలో ఎన్ని విజయాన్ని సాధించగలవో, వూహించడం వీలుపడని విషయం. అంతా దైవేచ్ఛ

— శ్రీనివాస్



''షోలే''లో ఒక దృశ్యం

"పెళ్ళాల్ని పుట్టింటికి పంపించకూడదోయ్ మూర్తీ! పుట్టింటికి వెళ్తే చాలు, మొగుళ్ళ సంగతి మరచిపోతారు."
అన్నాడొకసారి తనతో నారాయణరావు. ఆలోచిస్తే, వాడి మాటలు నిజమేననిపిస్తుంది.

# తిరుబుద్ధి

## కశింకోట ప్రభాకరదేవ



మా బామ్మరిది కొడుకు బారసాలకని వెళ్ళిన మా శ్రీమతి రెండువారాలు గడిచినా యింకా తిరిగిరాలేదు. ఇంట్లో ఒక్కడ్నీ, ఏంతోచడంలేదు. ఆఫీసునుండి యింటికి రాగానే బోసిపోయినయిల్లు నన్ను వెక్కిరిస్తున్నట్లుగా ఫీలింగు కలుగుతుంది నాకు. ఆ ఫీలింగును భరించడం రోజురోజుకు కష్టసాధ్యం అవుతుంది.

వెంటనే వచ్చేయమని వారంరోజుల కితం వుత్తరం వ్రాసాను. రెండురోజుల్లో వచ్చేస్తానని, ఏమీఅనుకోవద్దని వ్రాసింది. శ్రీమతి రావడానికిగాను పెట్టిన గడువు నిన్నటితోనే పూర్తయింది.

నిన్నంతా శ్రీమతికోసం ఎదురు చూస్తూనే గడిపాను. ఫలితం శూన్యం. ప్రాణం వుసూరుమనిపించింది! మా ఆవిడ మీద కోపంకూడా వచ్చింది. ఐనా, ఏం చెయ్యగలను? అసలు, మా ఆవిడ నాముందు వుంటే గద!

ఆలోచనలు నన్ను నిద్రపోనివ్వటంలేదు. పదేపదే మాఆవిడ గుర్తుకువస్తుంది. ఎప్పుడూ యింతే. పుట్టింటికి వెళ్ళిందంటే, నెలరోజులుండివస్తుంది. ఎన్నిచెప్పినా, తిట్టినా రాజకీయనాయకుడిలా దులిపేసుకుని, మరచిపోతుంది.

చేతికున్న వాచీని చూసుకున్నాను, తొమ్మిదయింది. ఆకలిగ్గా వుంది. కాని హోటలు కెళ్ళి భోజనం చెయ్యాలంటే బద్ధకంగా వుంది.

కూజాలోని నీళ్ళను గాజు గ్లాసులోకి వొంపుకొని తాగాను. సిగరెట్టు వెలిగించాను.

నా దృష్టి టేబులుమీదనున్న టెలిఫోను మీద పడింది. నా బుర్రలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

మా ఆవిడకి ఫోన్ చేస్తే...?

మరింకేం ఆలోచించలేదు.

గబగబా రెండువందల మైళ్ళ దూరంలో వున్న మా శ్రీమతికి — ఫోన్ నెంబరు డయిల్ చేసాను.

ఎక్ఛేంజివాళ్ల పుణ్యమా అంటూ పది నిముషాలకే కనెక్షను దొరికింది. అవతల ఫోన్ ఎత్తింది కూడా మా ఆవిడే. మా మావగారుగాని ఫోను ఎత్తితే కొంప మునిగిపోయుండేది. సవాలక్ష ప్రశ్నలతో ప్రాణాలు తీసేవాడు.

"ఎవరు కావాలండి?" మా శ్రీమతి కంఠం వీణ మీటినట్లుగా పలికింది.

"నేను పద్మా! మూర్తిని."

"మీరా? ఏమిటిలా ఫోన్ చేశారు?"

"మరేం లేదు. నాకు ఇక్కడ యేం తోచటంలేదు. అందుకని..."

"బుద్ధిలేకపోతేసరి. ఈమాత్రం దానికే ఫోను చెయ్యాలా? పది రూపాయలు దండగ" అంది కోపంగా.

మా ఆవిడ ఆర్థిక దృక్పథానికి నవ్వొచ్చింది నాకు.

"అది సరేగాని పద్మా! నిన్ననే వస్తానన్నావు. రాలేదేం?"

"మా అక్కకొడుకు నిన్ననే బొంబాయి నుండి వచ్చాడండి! వాడ్ని చిన్నప్పుడెప్పుడో చూశాను. అంతదూరంనుంచి వచ్చాడుకదా అని ......"

'ఓహో ... అర్థం అయింది. ఇంతకీ తమరు ఎప్పుడే వేంచేస్తారు? రేపు బయలు దేరకూడదూ?"

"సారి ...! రేపు మా యింట్లో సత్య న్నారాయణవ్రతం..."

"ఎల్లుండో ...?"

"కుదరదండి. ఎల్లుండి నా చిన్ననాటి స్నేహితురాలు వనజ పుట్టినరోజు."

"ఖర్మ! ఇంతకీ తమరెప్పుడు వస్తారో సెలవియ్యండి."

"మరీ అంతకోపంగా మాట్లాడితే ఎలా గండి? ఒక్కవారంరోజుల్లో వచ్చేయనూ! ప్లీజ్...ఈ ఒక్కసారికే...ఏంఅనుకోకండేం"

"నిన్ను పంపించడం నాదే పొరపాటు."

"అలా అనకండి. ఇంతకీ మీరు వేళకి సరిగ్గా భోజనం చేస్తున్నారా?"

"నేను భోజనం చేస్తేనేం? చెయ్యక పోతేం ఏం?? నామీదఅంత శ్రద్ధవున్న దాని వయితే ఇన్నిరోజులక్కడ వుంటావా?"

"మీకు కోపం ఎక్కువబాబు! ఎన్నాళ్ళకో వచ్చానని-ఇక్కడ మావాళ్ళు ఒకంతట నన్ను వదలడంలేదు. నన్నేం చెయ్యమంటారు?"

"ఊఁ..."

"ఇంతకీ చెప్పారు కాదు! వేళకి సరిగ్గా భోజనం చేస్తున్నారా? ఆరోగ్యం జాగ్రత్త."

"ఊ... హోటల్లో భోజనం చెయ్యాలంటే ఏడుపొస్తుంది ... పద్మా! త్వరగా వచ్చేయి."

"అలాగేనండి. ఒక్క వారం రోజులు ఓపిక పడుదురూ!"

"సర్లే... గుడ్‌నైట్!" విసురుగా ఫోను పెట్టేశాడు.

*　　*　　*

వారం రోజులయింది.

మా శ్రీమతి మాత్రం రాలేదు.

వాళ్ళ తమ్ముడు భార్యకి పురుడొచ్చిందట నాలుగు రోజులు వచ్చేసరికి ఆలస్యం అవుతుందని ఉత్తరం వ్రాసింది.

ఆ ఉత్తరం చదువుకొని, పిచ్చిగా జుత్తు పీక్కున్నాను. నారాయణతో నా బాధంతా చెప్పుకున్నాను

అంతా విని చిన్నగా నవ్వేడు. వాడు ఆడ వాళ్ల సైకాలజీని బాగా స్టడీ చేశాడు.

"ఆడవాళ్లంతా యింతేనోయ్. ఒకసారి.. మా భార్యారత్నంకూడా యిలాగే నన్ను ఏడిపించాలనుకుంది కాని, నేను మా ఆవిడ ఆటలు సాగనివ్వలేదు" అన్నాడు స్టైయిలిష్‌గా.

"ఏం చేశావేమిటి?" ఆతృతగా అడిగాను.

# ఆడబుద్ధి

మా వాడు సిగరెట్ వెలిగించి, తాపీగా పొగ వదుల్తూ చెప్పడం ప్రారంభించాడు.

నారాయణతో కొంతసేపు బాతాఖానీ కొట్టిన తరువాత, నా మనసు చాలా ఉల్లాసంగా ఉంది.

'క్వాలిటీ'కి వెళ్ళి భోజనంచేసి, తిన్నగా యింటికి వచ్చేసాను. టైం ఎనిమిదికావస్తుంది. చిన్నగా నవ్వుకొని, టెలిఫోన్‌ను దగ్గరకు తీసుకొని, నాకు కావలసిన నెంబరుకు రింగ్ చేశాను.

మా ఆవిడ లైన్‌మీదకు రాగానే

"నేను పద్మా! మూర్తిని..."అన్నాను.

"ఏమిటలా ఫోన్ చేశారు? యింకా నేను రాలేదని కోపమా?"

"కోపమా? నాకెందుకు??" అన్నాను అక్కసుగా.

"మీ మాటలబట్టే అర్థం అవుతుంది లెండి. ఇంకొక్క నాల్గురోజులేకదా! కాస్త

> పైవారమే
> **రాదారి పడవ**
> *దీపావళి సీరియల్ కథ*

ఓపిక పట్టేరంటే వచ్చేస్తాను. ప్లీజ్." అంది గోముగా.

"మరేం ఫర్వాలేదు డియర్! నాకిక్కడ బాగానేవుంది. హోటల్లో భోజనంగురించే భయపడ్డాకిని. ఇప్పుడా బాధ తీరిపోయింది. నీకు యిష్టం వచ్చినన్నిరోజులువుండు. నేనేం కోపగించుకోలే..."

"భోజనం హోటల్లో చెయ్యడంలేదా? కొంపదీసి స్వయంపాకం మొదలుపెట్టారేమిటి?" నవ్వుతూ ప్రశ్నించింది.

"అంత ఓపిక నాకెక్కడిది?"

"మరి......?"

"మా ఆఫీసులో స్టెనోగా పనిచేస్తున్న అమ్మాయి నీకు తెల్సుకదా?"

"ఆఁ...మేరీకదూ!?"

"అవును... ఆ అమ్మాయి నా అవస్థ చూసి, నువ్వు యిక్కడకు వచ్చేవరకూ తన యింట్లో భోజనం చెయ్యమని ఇన్వయిట్ చేసింది."

"ఏమిటి? ఆ కిస్టియన్‌ల అమ్మాయి యింట్లో భోజనం చేస్తున్నారా?? రామ ... రామ."

"ఛ...అలా అంటావేం పద్మా! మేరీ చాలా చక్కగా వండుతుంది. అక్కడంతా సదుపాయంగానే వుంది." అన్నాను.

"వుంటుంది...వుంటుంది! నేను నాల్గు రోజులు యింట్లో లేకపోయేసరికి మీకిదేం బుద్ధి? ఆ కిరాస్తానిదానియింటికి మిమ్మల్ని ఎవరు వెళ్ళమన్నారు? మగబుద్ధి పోనిచ్చుకున్నారు కాదు."

'అదికాదు పద్మా! నువ్వు రావడం ఎలాగు కొన్నాళ్ళు ఆలస్యం అవుతుంది కదా అని... ......" నా మాటల్ని మధ్యలోనే తుంచేసింది

"అదేం కుదరదు రేపు మధ్యాహ్నమే మెయిల్‌లో వచ్చేస్తున్నాను." అందికోపంగా. నేను నవ్వుకున్నాను.

"మరి మీ తమ్ముడి భార్యకి పురుడొచ్చిందికదా! నాల్గురోజులు వుండకపోతే ఏం బాగుంటుంది చెప్పు" అన్నాడు.

"అదంతా మీ కనవసరం. మీరు మాత్రం ఆ మేరీ యింటికి భోజనానికి మాత్రం వెళ్లకండి...వెళ్తే నే నొప్పుకోను."

"సర్లే. ఇంతకీ రేవు నువ్వు బయల్దేరడం ఖాయమేనా?" నారాయణ సలహా పనిచేస్తున్నందుకు ఆనందంతో అడిగాను.

"ఊఁ... ఏం మీకు బాధగా వుందా?" వ్యంగ్యంగా పలికింది మా ఆవిడ గొంతుకు.

"నాకెందుకు బాధ. స్టేషన్‌కు నిన్ను రిసీవ్ చేసుకోవడానికి వద్దామని అడిగాను అంతే."

"మీ మాయమాటలు నాకు తెలుసులెండి ఆ మేరీ యింటికెళ్తే నేనూరుకోను. హోటల్లోనే నేను వచ్చేవరకూ భోజనం చెయ్యాలి" అంది వార్నింగిస్తున్నట్లుగా.

"అలాగే పద్మా! రేపు బయల్దేరుతున్నావ్‌గా... గుడ్‌నైట్."

నారాయణకు మనసులోనే కృతజ్ఞత చెప్పుకుని, 'ఆడబుద్ధి'కి నవ్వుకుంటూ రిసీవర్‌ను పెట్టేశాను.

# అవకాశానికి అవసరమైనప్పుడు ధరించడానికి సాంప్రదాయక సౌందర్యంతో బట్టలు...



# హైదరాబాద్ నోట్ బుక్ — తిరుమల రామచంద్ర

## డాక్టర్ మహిషి సూచనలు

కేంద్ర మంత్రిణి డాక్టర్ సరోజినీ మహిషి అక్టోబర్ 27 సాయంకాలం ఆంధ్ర సారస్వత పరిషత్తుహాలులో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పాటుచేసిన "20 శతాబ్దంలో తెలుగు సాహిత్యమూ—మహిళలు" అనే గోష్ఠిని ప్రారంభిస్తూ భారతీయ మహిళలు వేదకాలంనుంచి ఎన్నో ఇడుములు పడ్డారని, వారు అజ్ఞానంలో వుంచబడ్డారని ఎంతో ధైర్యంగా చెప్పినందుకు మెచ్చుకోవాలి. ప్రతివారూ వేదకాలం గొప్పదని బడాయికొట్టేవారేగాని, ఆమెఅన్నట్టు వేదకాలంలో వున్న కొద్దిపాటి హక్కులుకూడ వారికి అనుభవానికి రాలేదు. ఆమె అన్నట్టు 30 ఏళ్లుగా ఎన్నో హక్కులు కలిగించినా మహిళలు వాటిని పూర్తిగా వినియోగించుకోడంలేదు. దీనికి సంఘంలో ఎంతో మార్పురావాలి, మహిళల ఆర్థిక పరిస్థితి బాగుపడితేనేగాని, వారికి సంఘంలో గౌరవం లభించదు, ఎవరో వేళ్లమీద ఎన్నదగినవారు పెద్ద పదవులలో వున్నంతమాత్రాన ఫలితం అత్యల్పం.

## శ్రీమతి పుటపర్తి కనకమ్మకు సన్మానం

"20 వ శతాబ్దంలో తెలుగు సాహిత్యం—మహిళలు" గోష్ఠిలోనే ప్రముఖ రచయిత్రి శ్రీమతి పుట్టపర్తి కనకమ్మ 1975 లో ఉత్తమ రచయిత్రిగా సన్మానింపబడినారు. డాక్టర్ సరోజినీ మహిషి ఈ సన్మానం జరిపారు. డాక్టర్ నాయుని కృష్ణకుమారి శ్రీమతి కనకమ్మ సారస్వత సేవను ప్రశంసించారు. శ్రీమతి కనకమ్మ సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ, తాను తన రచనలద్వారా మహిళా విముక్తికి కృషిచేస్తానని, "స్త్రీల విషయంలో నేను చెప్పవలసిందేమీలేదని ఇంతవరకు అనుకున్నాను. అంతర్జాతీయ మహిళా సంవత్సరం కారణంగా పలువురు రచయిత్రులు స్త్రీల సమాన హక్కులకోసం పోరాడడంచూచి నేనుకూడా నా రచనలతో ఆ లక్ష్యసిద్ధికి పోరాడుతాను" అని కరతాళధ్వనుల మధ్య ప్రకటించడం బాగుంది పుట్టిన యిల్లూ, మెట్టిన యిల్లూ విఖ్యాతమైన శ్రీమతి కనకమ్మవంటి విదుషీమణులు రంగంలో దిగినప్పుడే, మహిళలకు నిజమైన హక్కులు లభిస్తాయనడం నిస్సందేహం.

గోష్ఠికి అధ్యక్షత వహించిన శ్రీమతి ఆవుల జయప్రదాదేవి తమ ప్రసంగంలో మహిళోద్ధారకులైన మహామహులను ప్రశంసించడం ఆమె ఉదాత్తతకు తార్కాణ పురుషులు వేదకాలంనుంచి చేసిన అపరాధానికి పరిహారంగానా అన్నట్టు 20 శతాబ్దంలో మహిళాలోకానికి స్వస్వరూపజ్ఞానం కలిగించారు. 28 న గోష్ఠి రెండవనాడు డాక్టర్ నాయుని కృష్ణకుమారి కవిత్వం గురించి శ్రీమతి మాదిరెడ్డి సులోచన కథానిక నవల గురించి, శ్రీమతి అద్దేపల్లి వివేకానందాదేవి వీరేశలింగం గురించి, శ్రీమతి ఆనందా రామం చలంగురించి ప్రసంగించిన మీదట, కుమారి వాసిరెడ్డి సీతాదేవి కృతజ్ఞతతో రెండురోజుల గోష్ఠి సమాప్తమైంది.

## సమర్థులకే యు. జి. సి. వేతనాలు

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అక్టోబర్ 26 వ తేదీన విజయవాడలో ఉన్నత విద్యపై సదస్సును ప్రారంభిస్తూ, సమర్థులైన వారికే యు. జి. సి. జీతాల స్కేళ్లని ప్రకటించడంతో స్థానిక కళాశాల ఉపాధ్యాయులలో ఆందోళన చెలరేగింది. అర్హులైనవారినే కదా కళాశాలలో నియమిస్తారు. "ఆ అర్హత తర్వాత సమర్థత అనగానే ఏవేవో కారణాలతో, కార్పణ్యాలతో పలువురికి అన్యాయం జరిగే ప్రమాదం ఉంది. నియమించేటప్పుడే అర్హతలను, ఇతర యోగ్యతలను చూడండి. తర్వాత అవసరమైన పరీక్షలు ఉండనే వున్నాయి. ఇంత వున్నా సమర్థత అంటే, ఏమిటబ్బా!" అని పలువురు ఉపాధ్యాయులు ఆందోళన పడుతున్నారు. ఇలాంటి ఆందోళను తొలగించడం ప్రభుత్వం విధి.

## యు. పి. సంస్కృత మహాసభకు తెలుగు విద్వాంసుని అధ్యక్షత

ప్రముఖ విద్వాంసుడు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి అఖిల ఉత్తర ప్రదేశ్ సంస్కృత మహాసభకు అధ్యక్షత వహించి ఆంధ్రప్రదేశ్ విద్వన్మండలికి మరింత గౌరవం కలిగించారు. ఈ మహాసభ అక్టోబర్ 18, 19, 20 తేదీలలో జరిగింది. ఈ మహాసభను ప్రారంభించిన ఉత్తర ప్రదేశ్ గవర్నర్ డాక్టర్ ఎం. చెన్నారెడ్డి తమ ప్రసంగంలో "ఉత్తర భారత రాష్ట్రాలలో దక్షిణాదిభాషను ఒకదానిని నేర్పుతున్నారు. అది వారికి వ్యవహారంలో లేనందున అంతగా ఉపయోగపడడంలేదని నా అభిప్రాయం. సంస్కృతం నిర్బంధపరచేయంచేస్తే దేశమంతటికీ ప్రయోజనకరం" అన్నారు. ఈ విషయం విద్యావేత్తలు ఆలోచించాలి. శ్రీ లక్ష్మణశాస్త్రి, తమ ప్రసంగంలో "జాతీయ భాష ఏది అని వోటింగు జరిగినప్పుడు హిందీ సంస్కృతాలకు సమానంగా వోట్లువస్తే, అధ్యక్షుని కాస్టింగు వోటుతో హిందీ జాతీయబాష అయింది. హిందీతో పోటీపడిన సంస్కృతానికి కనీసం తగిన ప్రోత్సాహమన్నా, ఇవ్వడం అవసరం" అన్నారు. "స్వతంత భారత్", పత్రిక ప్రత్యేక ప్రతినిధి గోష్ఠిలోను శ్రీ శాస్త్రి

ఈవుహాటే అన్నారు. లక్నోలోని గీతా సత్సంగ్ సభ లోను, మరికొన్ని సంస్థలలోను ప్రసంగించి డాక్టర్ చెన్నారెడ్డితో సంస్కృత ప్రచారానికి పెక్కు ప్రణాళికలు చర్చించి, శ్రీ శాస్త్రి హైదరాబాద్‌కు అక్టోబర్ చివర తిరిగి వచ్చారు.

ఉ ప శ్రు తి ;

"నాన్నా, పెద్ద పెద్ద జీతాలవాళ్ళు తాము ప్రజా సేవకులమంటున్నారు. నాయకులూ, ప్రజాసేవకులం అంటున్నారు. పరిశ్రమల యజమానులూ ప్రజాసేవకులం అంటున్నారు. సేవ అంటే ఏమిటి ?" అని ప్రశ్నించింది. నాకుమార్తె నీరజ. "తల్లీ ! సేవా దర్మః "పరమగహనః యోగినామప్యగమ్యః" అన్నాడు భర్తృహరి. నేనేమి చెప్పగలనమ్మా ?" అని తప్పుకున్నాను. ●

*[గత సంచిక తరువాయి]*

# గెలుపు నాదే!





కుమారి ఒ. కొండూర్ల గౌరీదేవి

రాత్రి పడుకోబోయే ముందు వాసన్నయ్యకి క్షేమ సమాచారలతో ఉత్తరం వ్రాసాను. తరవాత వేణన్నయ్యకి వ్రాయటం మొదలు పెట్టాను.

"ప్రియమైన జోస్యాల వేణన్నయ్యగారూ!

తమరి జోస్యం మొదట్లోనే బెడిసి కొట్టింది. రవి పెళ్లి చేసుకోటానికి నిశ్చయించుకున్నాడు. అమ్మాయి పేరు మాల. త్వరలోనే నాన్నగారికి ఇన్విటేషన్ వస్తుంది. కాబట్టి ఇకనైనా ఇలాటి పిచ్చి దీవెనలు మానుకుంటావని ఆశిస్తున్నాను. మరోసారి మరోసారి ఐతే నీ టెరీకాట్ పాంట్ సంగతి నీ తప్పుకి శిక్షగా గాలికి వదిలేసేదాన్నే కానీ ఇది మొదటిసారిగా కావటంచేత క్షమించి వదిలేస్తున్నాను. కాబట్టి తస్మాత్ జాగ్రత్త!

ఇట్లు
సుజా!"

కవరు అంటించి, లైట్ తీసేసి మంచం మీద వాలిపోయాను.

అక్టోబరు 6, ఆదివారం, 1974

ఈ రోజు నీరజ పుట్టినరోజు. ధనవంతుల ఇళ్లల్లో పుట్టినరోజు ఓ చిన్న సైజు పెళ్లిలాటిదని ఆ రోజే తెలిసింది నాకు. ఇల్లంతా చక్కగా అలంకరింపబడింది. అన్ని గదుల్లోని కుర్చీలూ, సోఫాలూ తెచ్చి హాల్లో వేసాడు రాజయ్య. ఎప్పుడూ అటు పుల్ల తీసి యిటు పెట్టని రవి ఆ రోజు మాత్రం గోడలకి రంగు కాగితాలు కట్టి, పెట్టెలో పడేసిన పెయింటింగ్స్ తీసి అక్కడక్కడా అందంగా అమర్చాడు. నేను ఆకుల్తో సహా వివిధ రకాల పూలూ తెచ్చి హాలు మధ్యలో టేబిల్ మీది ఫ్లవర్ వాజ్‌లో అమర్చాను.

సాయంత్రం పార్టీ వేళకి అందరం తయారయి సిద్ధంగా ఉన్నాం. ఒక్క మాధవరావు గారు మాత్రం క్రితంరోజే ఏదో అర్జెంటు పని తగిలి బెజవాడ వెళ్లారు. తలంటి పోసుకున్నందువల్ల కాబోలు సహజంగా నొక్కులుగా ఉండే నీరజ జుట్టు మరింత వంకులు తిరిగి ఆకర్షణీయంగా కనిపిస్తోంది. చామన ఛాయ రంగులో ఉండే ఆమెకి లేత నీలిరంగు నగిషీ చీర బాగా నప్పింది. పచ్చలూ, కెంపులూ పొదిగిన కమ్మలూ, బంగారు గొలుసూ, పైన చిన్న నెక్లెసూ ఆమెకి వింత శోభ నిస్తున్నాయి. అదే నీరజతో అంటే థాంక్స్ చెప్పి,

"అది సరేగానీ నువ్వింత సింపుల్‌గా తయారయావేమిటి? నా కెంపులు సెట్టిస్తాను. పెట్టుకో గూడదూ?!" అన్నది. నేను వేసుకున్న ఎంబ్రాయిడరీ చేసిన తెల్ల ఫారిన్ నైలెక్స్ చీర వంకా ముత్యాల దండ వంకా, మట్టిగాజుల వంకా మార్చి మార్చి చూస్తూ,

"పోదూ! పుట్టినరోజు నీది కానీ నాది కాదుగా!" తేలిగ్గా అనేసాను.

గ్రే కలర్ ఫుల్‌ట్వీడ్ సూటులో అప్పుడే మెట్లు దిగి వస్తున్న రవి నా మాటలకి నవ్వి, "నువ్వో పిచ్చిదానివిలా ఉన్నావు. పేరుకి నీరజ పుట్టిన రోజన్న మాటేగానీ ఒక్కొక్కరి వేషాలూ, అలంకరణలూ చూస్తే ముఖాముఖీ పరిచయం లేనివాళ్లు ఎవరి

> **జరిగినకథ 4:** తండ్రి చిన్ననాటి స్నేహితుడైన మాధవరావుగారి ఆఫీసులో వుద్యోగం సంపాదిస్తుంది సుజాత. కొడుకు రవికి మేనకోడలు నీరజనిచ్చి పెళ్లి చేయా లనుకుంటారు మాధవరావుగారు. రవీ మాలల పరిచయం నీరజకు ఇష్టం వుండదు. రవీ నీరజల మధ్య అభిప్రాయబేధాలు పెరుగుతాయి. నీరజ, జయరాం తనని పెళ్లి చేసుకుంటానని కోరినట్లు రవితో చెప్తుంది. రవి, మాలను చేసుకోబోతున్నట్లు సుజాతకు చెప్తాడు.

పుట్టినరోజో, ఎవరు చూడటానికి వచ్చిన వాళ్లో ఛస్తే కనుక్కోలేరు" అన్నాడు. నేనేం మాట్లాడలేదు. రవి ఏదో ఆలోచించి కాస్సేపయాక పక్కకి తిరిగి, "నీరజా! నీ కిష్టంలేదని తెలిసినా మాలని పార్టీకి పిలిచాను. ఏమీ అనుకోవుగా!" అన్నాడు

నీరజ తేలిగ్గా నవ్వింది. "అనుకోటానికేముందిందులో? నేనూ జయరాంని పిలిచాను."

"అఫ్‌కోర్స్, అతన్ని పిలవటం ముఖ్యమని నేనూ ఒప్పుకుంటాను" అని కొంచెం ఆగి,

"అతను రాగానే నాకు పరిచయం చెయ్యి అతనెలాటివాడో చూస్తాను" అన్నాడు.

"అలాగే!" వెంటనే ఒప్పుకుంది నీరజ.

పిలిచిన వాళ్లతో చాలామంది వచ్చేసినా కంటా జయరాం, మాలా మాత్రం రాలేదు. నీరజ ముఖంలో నిరాశ స్పష్టంగా కనిపిస్తోంది. రవి సరేసరి. నాకు మాత్రం ఎందుకో మాల రాక బొత్తిగా ఇష్టంలేదు. రవి ఆమె వస్తే సంతోషించే వాళ్లలో మొదటి వాడయితే నేను ఆఖరిదాన్ని.

అరగంట తరవాత జయరాం వచ్చాడు. వస్తూనే నీరజకి క్షమాపణలు చెప్పుకుని చక్కటి ఉంగరం ప్రెజెంట్ చేసాడు. నీరజ రవిని అతనికి పరిచయం చేసింది కాబోలు వాళ్లిద్దరూ నవ్వుకుంటూ కరచాలనం చేసుకుని నీరజని వదిలేసి కాస్త ముందుకి రావటం కనిపించింది. వాళ్లిద్దరూ ఏదో మాట్లాడుకుంటూంటే ఫలహారం తీసుకెళ్లి జయరాంకి అందిస్తూ, "నమస్తే! గుర్తు

న్నావా ?" అడిగాను,

"భలేవారే! అంత తొందరగా, అందులో నీరజ పరిచయం చేసిన వ్యక్తిని మరిచిపోతానా సుజాతగారూ ?" నవ్వాడతను. రవి మా ఇద్దరి వంకా మార్చి మార్చి చూసి, నాతో "అయితే నాకు తెలిసిన అందరూ నీకు నాకంటే ముందుగానే తెలుసన్నమాట! జయంరాంగారూ, మాల ..." అంటూ

రంగుల చిన్న ప్లాస్టిక్ పూలూ, పెదవులకి చీర రంగుతో పోటీ పడుతున్న లిప్‌స్టిక్, వీట న్నిటినీ మించి పసిడి ఛాయతో మెరిసి పోతున్న సుకుమారమైన శరీరం ... ఆమెని చూసిన ఎవరూ కాస్సేపు ఎక్కడ నిలబడ్డ వారు అక్కడే ఉండి చూడకుండా ఉండలేరు. రవి ప్రక్కన ఆమెని మరీ మరీ చూడాలని పిస్తోంది. అందరం క్షణంపాటూ ఆమెని

చూస్తూ నిల్చుండిపోయాం. మొదట నేనే తేరుకుని పలకరింపుగా నవ్వాను. ఆ వెంటనే ఆమె కూడా నవ్వింది, సహజంగా మాత్రం కాదు. రవి ఆమె దృష్టి ఎటు వుందా అని వెతుకుతూ చూసినట్లు నా వంక చూసాడు.

నేను ముందుకి కదిలాను. ఊరికే మర్యాదకి పలకరించకపోతే బావుండదని దగ్గరికివెళ్లి "హల్లో మాలా! గ్లాడ్ టు మీట్ యూ." అన్నాను. నాకు తెలుసు మాలలాటి వాళ్లు మాతృభాష తెలుగని చాలా వరకూ మరిచి పోతూంటారు. నేననుకున్నట్లు ఇంగ్లీష్‌లోనే సాగింది సంభాషణ.

"హల్లో! ఎలా ఉన్నావ్ సుజాతా?" మాల తేరుకుని ఊహించని విధంగా నా చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కింది. నేను తప్ప మిగతా ఎవరైనా అలా మమ్మల్ని చూస్తే ప్రాణస్నేహితుల మేమోనని పొరపడక మానరు



మధ్యలోనే ఆగిపోయి, చటుక్కున లేచి నిల్చుని "ఇప్పుడే వస్తాను" అంటూ ముందుకు నడిచాడు.

అతను వెళ్లిన వైపు చూసిన నేను క్షణం కళ్ళు తిప్పుకోలేకపోయాను. నేను ఊహించినదే నిజమైంది. మాల వచ్చింది. సన్నటి ఎర్రపిఫాన్ చీరా, అదే రంగు జాకెట్టూ, ఎత్తుగా సిగ. సిగ మధ్య అక్కడక్కడా నక్షత్రాల్లా మెరుస్తున్న రంగు

చూస్తూండిపోవటంతో హాలంతా నిశ్శబ్దమైపోయింది. అందరూ తనని కన్నార్పకుండా చూడటం వలన కాబోలు గర్వంతో ఆమె కళ్లు మెరుస్తున్నాయి. నిర్లక్ష్యంగా అందరి వంకా చూసీ చూడనట్లు చూచిన ఆమె కళ్ళు నా మీదపడి అలాగే నిలిచి పోయాయి

ఒక్క నిముషం... రెండు నిముషాలు... అలా ఒకరి కళ్లలో భావాలు మరొకరం చదు

"రవి నిన్ననే అడిగాడు సుజాత అనే అమ్మాయి నీకు తెలుసా అని. తెలుసన్నాను. నువ్విక్కడే ఉంటున్నావని అప్పుడే తెలిసింది. లేకపోతే..." ఆమె ఆగి తియ్యగా నవ్వింది.

"లేకపోతే..." నవ్వుతూనే రెట్టించాను.

"వచ్చి స్నేహితురాల్ని వాటేసుకునేది. అవునా మాలా?" రవి వెక్కిరించాడు. అతని ఉచ్చారణ స్వచ్ఛంగా, మధురంగా ఉంది.

# గెలుపు నాదే

"ఛ! ఛో! నీకంతా వేళాకోళం." అందంగా మూతి ముడుచుకుంది మాల.

"అది సరే కానీ నువ్వు ఎమ్.ఎ లో చేర్తావనుకున్నాను. తెలివైనదానివి, నువ్వే చదువాపేస్తే ఎలా?" అన్నది అదోరకంగా.

నవ్వి ఊరుకున్నాను.

'డబ్బున్నవాళ్లకి చదువు వొంటబట్టక పోవటం, తెలివైనవాళ్లకి చదువుకునే అదృష్టం లేకపోవటం సహజమేగా!' అందామనుకుని ఊరుకున్నాను.

"ఆడపిల్లలు గ్రాడ్యుయేషన్‌దాకా చదివితే చాల్లెద్దూ!" రవి అన్నాడు. అది నన్ను సమర్థించటమో, మాల చదువుని కూడా దృష్టిలో పెట్టుకుని అనటమో అర్థం కాలేదు నాకు.

"మీరలా అంటే నేను వొప్పుకోను..." వాదనకి దిగబోయాను. కానీ రవి భయపడుతున్నట్లుగా ముఖం పెట్టి,

"సుజా! ప్లీజ్. ఇప్పుడుకాదు. మనిద్దరం వాదించుకోటం మొదలుపెడ్తే దానికి అంతం ఉండదు" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకుండదు? అసలు మీరు..."

"అదుగో మళ్ళీ వాదిస్తున్నావ్." అతను మధ్యలోనే వారించటంతో ఊరుకున్నాను. రాజయ్య కోకో-కోలాలు తెచ్చి మాకిచ్చాడు. అందుకుంటూ అంతలోనే గుర్తొచ్చినట్లు.

"కంగ్రాట్యులేషన్స్." అన్నాను మాల వంక తిరిగి.

"ఎందుకు?" ఆశ్చర్యంగా చూసిందామె. 'రవిలాంటి చక్కటి యువకుడ్ని గెల్చుకున్నందుకు' అని చెప్పటానికి నోరు తెరిచాను. కానీ అది గ్రహించి రవి చురుగ్గా వద్దన్నట్లు సైగ చేసాడు. హఠాత్తుగా అతను వారించటంతో ఎలా మాట మార్చాలో తెలీక తికమక పడ్డాను.

నా అవస్థ గ్రహించినట్లు నా బదులు రవి జవాబిచ్చాడు. "ఎందుకంటే వస్తూనే ఇక్కడున్న అందర్నీ ఒక్క క్షణం మాట్లాడలేనంత నిశ్శబ్దంగా చేసినందుకు. నిజంగా నువ్వీవాళ చాలా చాలా బావున్నావు. అవునా సుజా!" అన్నాడు నావంక తిరిగి.

"మరే!" వొప్పుకుంటున్నట్లుగా తలూపాను. తన అందాన్ని ఇద్దరం అలా ఏకగ్రీవంగా పొగిడేసరికి మాల గర్వపడిపోయింది.

కాని నాకు రవి ఉద్దేశ్యం అర్థం కాలేదు. అతను మాలతో పెళ్లి విషయం ప్రస్తావించలేదా ఇంకా! అయితే ఎందుకు? నా ఆలోచనలు గ్రహించినట్లుగా,

"ఆలోచనలు తరువాత. పద! అక్కడ వాళ్లందరూ ఏదో ఆడుతున్నట్లున్నారు. మనమూ వెళ్లి చూద్దాం. కమాన్ మాలా!" అతను ముందుకు నడిచాడు.

మేం అనుసరించాం.

అప్పటికే చాలమంది అతిథులు వెళ్లిపోయారు. నీరజ స్నేహితురాళ్లు చాలామంది వెళ్లిపోయినట్లున్నారు. ఒకరో ఇద్దరో మిగిలారంతే. వచ్చిన కాసేపట్లోనే సెలవు తీసుకువెళ్లిపోయారు డాక్టర్‌గారికుటుంబం. లాయర్ శ్రీనివాసరావుగారు ప్రొద్దునే ఒక్కరూ వచ్చి వాళ్లావిడకి ఒంట్లో బాగా లేక రాలేకపోయినందుకు క్షమాపణలు చెప్పుకున్నారు. రవి స్నేహితులు నలుగురైదుగురికి మించిలేరు. మొత్తంమీద సాయంత్రం అయిదింటికి ఉన్న రద్దీ ఇప్పటికి బాగా పలచబడిపోయింది.

మేం వెళ్లేసరికి నీరజా, జయరాం చదరంగం ఆడుతూ కనిపించారు. "సుజీ! చూడు ఈయన నన్నెలా ఓడించేస్తున్నారో? నువ్వు నా బదులు ఆడి ఆయన్ని ఓడించాలి." అన్నది నీరజ నవ్వి తన సీట్లోనుండి లేస్తూ.

"ఇప్పుడు ఇన్ని జంతువులు పోగొట్టుకున్నాకనా నన్ను ఆడమనటం? ఓడిపోతే సుజాత ఓడిపోయిందని టాం టాం చెయ్యటానికికదూ!" నవ్వుతూ ఆమెలేచిన కుర్చీలో కూర్చున్నాను. నిజానికి ఒక ఏనుగు, రెండు శకట్లు లీడింగ్‌లో వున్నాడతను. అయితే అతని రాజు పొజిషన్ బొత్తిగా బాగాలేదు. గుర్రాల్ని సరిగ్గా ఉపయోగించగలిగితే కొంత వరకూఅతనిజంతువులుస్వాధీనపరుచుకోటానికి అవకాశం లేకపోలేదు. ఆ ఆశతోనే ఆట సాగించాను. పది పదిహేను మూవ్స్ గడిచిపోయాయి. మాలకి విసుగొచ్చినట్లుంది కాబోలు కాస్త దూరంగా వెళ్లి కూర్చుంది. అంత అందమైన అమ్మాయితో మాట్లాడే అవకాశం పోగొట్టుకోవటం ఇష్టంలేక కొందరు యువకులు ఆట చూడ్డం మానేసి మాల చుట్టూ చేరారు. అయితే ఆశ్చర్యమేమిటంటే రవి మాత్రం ఎక్కడికీ వెళ్లకుండా ఓపిగ్గా, శ్రద్ధగా మా ఆటని గమనిస్తున్నాడు.

జయరాం రూక్‌ని రెండడుగులుముందుకు జరిపాడు. ఆ మూవ్ కోసమే ఎదురు చూస్తున్న నేను వెంటనే ఒక పాన్‌ని ముందుకి జరపబోయాను. ఇంతలో రవివేళ్లు నా వేళ్లని గట్టిగా పట్టుకున్నాయి.

"అరెరె! సరిగ్గా చూసుకుని ఆడు సుజా! ఆ మూవ్ చేస్తే చెక్ రావటానికి అవకాశం వుంది" అన్నాడు.

అందరూ అతనివంకా, నా వంకా, మా చేతులవంకా మార్చి మార్చి చూస్తూండటం గమనించిన నేను సిగ్గుతో చితికిపోయాను. త్వరగా అతని చేతులు విడిపించుకుని.

"పోనిండి. ఆట త్వరగా అయిపోతుంది." అంటూ అదే మూవ్ చేసాను. "కాదు. నువ్వు సరిగ్గా చూడటంలేదు..." రవి ఏదో అనబోయాడు.

"ఇది అన్యాయమండీ. నీరజే అనుకున్నాను. మీరూ సుజాతవైపే ఉంటే ఇక నేను గెల్చేదెలా?" హాస్యంగా అన్నాడు జయరాం.

"మీకా భయం అక్కర్లేదులెండి. సుజాత మొండిది. ఎవరి మాటా వినదు." రవి కూడా నవ్వాడు.

రవి అన్నట్లే చెక్ వచ్చింది. కానీ నా రాజుకి పాన్ అడ్డువేసుకున్నాను. ఆ తరవాత మూవ్‌లో నా నైట్‌తో అతని రాజుకి చెక్ పెట్టాను. ఆ చెక్ అంతకుముందే రావటానికి అవకాశమున్నా అతని రాజుకి ఒక్క గడి ఫ్రీగా ఉండటంతో నేనా పని చెయ్యలేదు. ఇందాక నా రాజుకి చెక్ వచ్చినప్పుడు అడ్డు

# గెలుపు నాదే

చేసుకున్న పానే ఇప్పుడా గడికి రావటానికి అవకాశం లేకుండా చేసినందువల్ల చెక్ మేట్ అయింది. జయరాం ఒక్క క్షణం బిత్తరపోయి, మరుక్షణం నవ్వేసాడు.

"వండర్‌ఫుల్ సుజాతా! కంగాట్యులేషన్స్." అన్నడు బోర్డు మూసేసి లేస్తూ.

"మీ కంగ్రాట్యులేషన్స్ నీరజకి చెప్పండి. ఆమె బదులేగా నేనాడింది?" అన్నాను నవ్వి.

"నో. నో. ఆడింది నువ్వే కాబట్టి నీకే చెప్పాలి." నీరజ అంది.

రవి అప్పటికి ఆశ్చర్యంలోనుండి తేరుకున్నాడు. "నీ చిన్ని బుర్ర. ఇంత గట్టిదనుకోలేదు సుజా! నీకు కాదు. నీ బుర్రకి కంగ్రాట్యులేషన్స్ చెప్తున్నాను." అన్నాడు. అతని మాటలకి అందర్తోపాటూ నేనూ నవ్వేసాను.

ఆ తరవాత ఫొటోల తతంగం ఓ అర గంట సాగింది. మొదట నీరజకి (పుట్టిన రోజు కాబట్టి. లేకపోతే మాలకయి ఉండేదేమో!) తీస్తానన్నాడు రవి. వెంటనే నీరజ మంచి పోజులో నిల్చుంది.

రవి వెనక్కివెళ్లి పొజిషన్ అడ్జెస్ట్ చేసుకోసాగాడు. "కొద్దిగా వెనక్కివెళ్ళు నీరజా!... ఆఁ ఆఁ అంత వెనక్కికాదు. పుట్టినరోజునాడు బిగపట్టుకుని నిలబడితే ఎలా; కొద్దిగా నవ్వాలి... అహఁ! మరీ అంతగా కాదు చిరునవ్వు చాలు ..." ఇలా ఏదో ఒకటి చెప్తూ ఐదు నిమిషాలు పొజిషన్ బాగా లేదంటూనే గడిపాడు రవి. అతను చేసే విన్యాసాలకి నవ్వుతూ చూస్తున్నాం. ఇంతలో ఉన్నట్లుండి అతను పొజిషన్ మార్చి కన్ను మూసి తెరిచేలోగా కెమరా నా వంక తిప్పి ఫొటో తీసేసాడు. ఫ్లాష్ నా మీద పడటంతో బిత్తరపోయి.

"అదేమిటి?..." అంటూ నేనేదో అనబోయేలోగా.

"హుష్ మాట్లాడకు మరొకటి తీస్తున్నాను. బాగా పడాలని ఉంటే కదలకు." అంటూ అతను కసురుకోవటంతో చేసేదిలేక బలవంతంగా నవ్వుముఖం పెట్టాను. నన్ను ఫొటో తీస్తున్నాడనే అనుకుని అందరూ నవ్వు మొహాల్తో నావంక చూస్తూంటే, ఈసారి టక్కున నీరజ ఫొటో తీసేశాడు. మొత్తం అందర్నీ ఇలాగే మభ్య పెట్టి ఫొటోలు తీసాడు.

అంతా అయిపోయాక జయరాం నవ్వుతూ "ఇదేం కొత్తపద్ధతండీ రవీ? అందర్నీ ఒక ఊపు ఊపేశారు." అన్నాడు నవ్వుతూ.

"అదే నాకూ అర్థం కావటంలేదు." అన్నది మాల.

రవి తేలిగ్గా. "అర్థం కావటానికి కేముందండీ ఇందులో? ఫలానా వాళ్లని ఫోటోతీస్తున్నాను అనేసరికి అంతదాకానవ్వుతూసహజంగా నిల్చున్నవాళ్ళు కాస్తా బిగుసుకుపోయి ఆర్టిఫిషియల్‌గా ముఖం పెట్తారు. అందుకే ఈ పద్ధతి అవలంబించాల్సి వచ్చింది. ఫోటోలు బ్రహ్మాండంగా వస్తాయి చూడండి" అన్నాడు నవ్వుతూ.

---

# నిద్రపోయిన రికార్డులు

నేపుల్స్ మునిసిపల్ కార్పొరేషన్ రికార్డులు చూస్తే ఏ నాలుగు ఏళ్ల కాలంలో అక్కడసలు జనన మరణాలుగాని, వివాహ విడాకులుగానీ ఏ విధమైనటువంటివీ జరగనట్టు ఉందట. ఇదేమి వింతయా అని కాస్త తరచి చూస్తే ఆ నాలుగేళ్ల లోనూ 92 పుట్టుకలు, 140 వివాహాలు, 42 చావులూ జరిగినట్టు తేలిందట. దీన్ని బట్టి మునిసిపల్ కార్పొరేషన్‌కు చెందిన ఆ రికార్డుల శాఖ యీ నాలుగేళ్లూ ఆదమరచి నిద్రపోయినట్టు, రికార్డులు రాయడం మరచిపోయినట్టూ పై అధికారులు గ్రహించి, విచారించారట.

## చీమలు రోగ నిరోధకాలా?

పక్షులు తమకు కాళ్ళనొప్పులు, కీళ్ల వాతాలు తప్పలితంగా రెక్కలు ఆడకపోడాలు రాకుండా ఒక రకమైన స్ప్రేను మీద జల్లించుకుంటాయట. చీమలలోని ఫార్మిక్ ఆసిడ్‌ని యివి లతి నేర్పుగా తమ శరీరం మీద జల్లించుకుంటాయట. చీమల బారు కనబడ్డంలోనే పక్షి ఆ బారుకు అతి సమీపంగా వెళ్లి ముక్కుతో ఆ చీమను నొక్కి పట్టుకుంటుందట. ఆ ఫార్మిక్ ఆసిడ్ కళ్లలో పడకుండా కళ్లు మూసుకుంటుందట. తమ శరీరం లోంచి ఆ ఆసిడ్ ఎనిమిది అంగుళాల దూరంవరకూ స్ప్రే చేయబడుతుందట. జర్మన్ దేశానికి చెందిన ఒక జంతు ప్రదర్శన శాలలో కొందరు శాస్త్రవేత్తలు యీ చర్యను బహు సున్నితమైన కెమెరాతో సినిమా తీశారట—చూశారా!! ఇంకా లేదు

## భార్యలను హింసించే భర్తల వెలి

భార్యలకు సరయిన స్థానం యివ్వకుండా (?) హీనంగా చూసే భర్తలను సాంఘికంగా వెలివేసి సంతపనీ చేసెయ్యాలని, ఇంటి పనులలో (అనగా ఏవేవి) సాయంచేయని భర్తలను యింట్లోంచి

# ఫాలాక్షుని డైరీ

వెళ్లగొట్టాలని, గోవా ముఖ్యమంత్రిణి శశికళా కకోడ్కర్ అన్నారట. స్త్రీకి ఏమాత్రం జొస్వత్యం లాదేదని యీమె తన విచారాన్ని సూచించారట. ఆ రప్పంతా స్త్రీదేనని కూడా అన్నారట. స్త్రీ పురుషులకు సమాన జీతాలను యిచ్చి తీరాలనే చట్టం గోవా ప్రవేశపెట్టిందని ఆమె తెలియజేశారట. —మావూళ్లో హిందీ మేష్టారినివాళ్ళావిడ ముప్పొద్దులా. . . చెప్పొద్దు!! నో రెమెడీ సజెస్టెడ్!!

## ఖైదీల శ్రమదానం

పూనాకు చెందిన యర్వాడ సెంట్రల్ జైలులోని ఖయిదీలంతా ఒకటై, జైలుకు చుట్టూ

"తెలివిగలవారే!" మెచ్చుకున్నాడు జయరాం.

మొత్తంమీద ఉత్సాహంగా గడిచిపోయింది సాయంత్రమంతా. భాగా చీకటి పడటంతో మిగిలిన ఆ కొద్దిమందీ కూడా సెలవుతీసుకు వెళ్ళిపోయారు. జయరాంని నీరజ గుమ్మం దాకా సాగనంపితే, మాలని స్వయంగా కార్లో తీసుకెళ్ళి ఇంటి దగ్గర డ్రాప్‌చేసి వచ్చాడురవి.

ఆ రోజు రాత్రి చల్లగాలికి హాయిగా ఉంటుందని ముగ్గురం డాబాకి మూడు మూలలా మంచాలువేయించుకు పడుకున్నాం. మా ప్రక్కనే కాస్త దూరంలో రాజయ్యా, వంట మామ్మగారూ పక్కలు పరుచుకు పడుకున్నారు. చాలాసేపు సాయంత్రం ఎవరే జోక్స్ వేశారో చెప్పుకుంటూ, అందరి గురించి మాట్లాడుకుంటూ గడిపాక రవీ, నీరజా నిద్రలోకి జారిపోయారు. నాకు ఇంకా నిద్ర పట్టడం లేదు.

బహుశా రవి మాలతోనూ, నీరజ జయరాంతోనూ స్వప్నలోకాల్లో విహరిస్తూ వుండ వచ్చు. కానీ నాకలాటి వారెవరూ లేరు. కాస్సేపు వాసన్నయ్య ఇంటర్వ్యూ గురించీ, నాన్న ఆరోగ్యం గురించీ, ఆ తరువాత కథ కేదన్నా ప్లాటు దొరుకుతుందేమోననీ ఆలోచిస్తూ, నక్షత్రాలవంక చూస్తూ పడుకుండి పోయాను.

అక్టోబరు 11, శుక్రవారం 1974.

రెండ్రోజుల నుండీ రవి అందర్తోనూ చాలా ముభావంగా ఉంటున్నాడు. బాగా జ్వరం కూడా వస్తోంది. డాక్టర్‌గారి దగ్గరి కెళ్ళి చూపించుకోమని నేనూ, నీరజా ఎంతగా చెప్పినా అతను వినలేదు.

"ఇంత చిన్న జ్వరానికి డాక్టర్లేమిటి? మీకేం తెలీదు. ఊరుకోండి." అంటూ కొట్టి పారేసాడు. మాధవరావుగారు ఉంటే ఆయన చెప్తేనైనా వినేవాడేమో కానీ ఆయన ఊర్నుండి ఇంకా రాలేదు. ట్రంకాల్ చేసి తనొచ్చేసరికి మరో నాలుగైదు రోజులు పట్టొచ్చనీ, కంగారు పడవద్దనీ, చెప్పారాయన. నీరజ రవి జ్వరం సంగతి చెప్తానన్నది కానీ రవి కొరకొరా చూసి,

"ఆయనని కంగారుపెట్టి పనులు కూడా మానేసి ఇక్కడికి రప్పించాలన్నట్లుంది నీ వాలకం చూస్తే! ఏం చెప్పనక్కర్లేదు." అంటూ ఖచ్చితంగా చెప్పటంతో చేసేది లేక ఆమె ఊరుకుంది.

ఎప్పుడూ నిలకడగా దేన్ని గురించీ క్షణమైనా సరిగ్గా ఆలోచించని రవి ఈ రెండ్రోజులుగా తీవ్రంగా ఆలోచించటం, కాస్సేపయాక ఆ ఆలోచించే ఓపిక లేదన్నట్లు నీరసంగా కణతలు నొక్కుకోవటం విచిత్రంగా అనిపించసాగింది.

"అసలిలా ఆలోచించటం వలనే తలనొప్పీ, జ్వరం ఎక్కువ చేసుకుంటున్నావు." నీరజ అన్నది.

"ఏం జరిగిందో మాతో చెప్పకూడదా?" అడిగాను అనుమానంగా.

"ఏం జరుగుతుంది? ఏం లేదు. అనవసరంగా జరగనివి ఊహించకు." రవి కాస్త తొట్రుపాటు పడ్డా, తేలిగ్గా అనటానికే ప్రయత్నించాడు. కానీ నేను నమ్మలేదు. ఏదో జరిగి ఉండకపోతే రవి అలా నిస్పృహగా ఉండడు. దానికి తగ్గట్లుగానే సాయంత్రం మాల దగ్గర్నుండి ఫోన్ వచ్చిందని నేను వెళ్ళి చెప్పగానే అంతెత్తున ఎగిరిపడ్డాడు రవి.

"అబ్బబ్బ! జ్వరంలో ఉన్నాను కదా నిద్ర పోతున్నాడనో, నీరసంగా ఉన్నాడనో చెప్పక పోయావా? ఆ మాత్రం కామన్ సెన్స్ లేదూ?" విసురుగా లేచి నీరసంగా క్రిందికి వచ్చాడు. బిత్తరపోయి అతనివెనకే క్రిందికి వచ్చిన నేను సభ్యతకూడా మరిచిపోయి ఫోన్లో అతను పెడుతున్న కేకలకి ఆశ్చర్యపోయాను.

"ఆ విషయం ఇక నాతో మాట్లాడవద్దని నిన్ననే చెప్పాను నీతో!... అనవసరం రానక్కర్లేదు... వాట్ డూ యూ మీన్? ఏం చేస్తావో చేసుకో..." చటుక్కున ఫోన్ పెట్టేసి చరచరా పైకెళ్ళిపోతూ.

"చూడు సుజాతా! మాలేకాదు ఎవరు ఫోన్ చేసినా నేను లేనని చెప్పు." అన్నాడు. అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లు ఆగి, "నీరజా!" అంటూ కేకేసాడు. ప్రక్కగదిలో ఏదో పత్రిక చూస్తున్న నీరజ.

"ఏమిటి బావా?" అంటూ వచ్చింది.

రవి రెండు నిమిషాలాలోచించి, "నీరజా! జయరాంకి నీ అంగీకారం తెలుపు. అతను మంచివాడూ, సమర్థుడూ అన్న సంగతి అతన్తో మాట్లాడిన కాస్సేపట్లోనే తెలిసి పోయింది. నిజం! అతను నా కంటే అన్ని విధాల నీకు తగినవాడు." అన్నాడు చిన్నగానవ్వి.

నీరజ నవ్వింది. "ఆ పని నేను మొన్ననే

---

వున్న నలభై హెక్టేర్ల భూమిని ఆకు పచ్చని కూరల తోటగా మార్చేశారట. ఈ 4,000 మంది ఖయిదీలు తమంతట తామే శ్రమదానం చేయటం వలన రాష్ట్రానికి ఒకటిన్నర లక్ష కలిసొచ్చిందట. రెండేళ్ల క్రితం జైలు సూపరింటెండెంటుగారు ఇలా చేస్తే ఎలా వుంటుంది చెప్మా అనుకున్నారట. దాంతో యీ ఖయిదీలలో వుత్సాహం పుట్టిందట. ఇప్పుడీ తోటలో గతతొమ్మిదినెలలలో 2,53,000 కిలోల కూరలు పండించారు. గత వేసంగిలో 400 క్వింటాళ్ల కూరలు బొంబాయి, తానా జైళ్ళకు కూడా పంపారట.

## హాస్యం ఉత్తమౌషధం

ఆర్థికంగా ఆనందం లేనివారికి, నిత్య జీవితంలో అనేక కారణాలవల్ల ఆనందం కొరత ఆవు తున్నవారికి, అసలు అందరకూ యీ రోజుల్లో హాస్యం అనేది చాలా చక్కని మందుట. హాస్యం శరీరారోగ్యానికి చాలా మంచిదట. దీనివల్ల రక్తపు పోటు క్రమబద్ధం అవుతుందని, అంతేగాక శరీరావయవాలలో చక్కని కదలిక పుట్టడం వల్ల ఆహారం ఎంచక్కా జీర్ణం అవ్వడానికి వీలవుతుందని, జీవశాస్త్ర సంబంధమైన పరిశోధనలు వెల్లడించాయట.

## అల్సరు మాన్పే యింజెక్షన్

"బ్లీడింగ్ అల్సరు" రోగం చాలా భయంకరమైనదనీ, సామాన్యంగా అటే తేలిపోతుందనీ అంటుంటారు. దీనికి కార్నెల్ విశ్వవిద్యాలయం ఓ మందు కనిపెట్టిందట. సెమటోట్రోఫిన్ అనే ఓ హార్మోనును ఇంజక్షనుద్వారా రోగి శరీరంలోకి పంపుతారట. ఈ ఇంజక్షనులు రోజూ యిస్తారట. దీనివల్ల ఆ బ్లీడింగ్ అల్సరు మీద ఒక పొరవంటిది ఏర్పడి రక్తస్రావాన్ని ఆపుతుందని, ఆ అల్సరు చుట్టూ కప్పులా యిది ఏర్పడ్డాక కురుపు తగ్గే ధోరణిలో తగ్గుతుందని యీ శాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారట. గోవాలో వందకి ఒకరు పెప్టిక్ అల్సరుతో బాధ పడుతూనే వున్నారని, పన్నెండు ఎనిమిది లక్షల జనాభాలో యీ శాతం పెప్టిక్ అల్సరుతో వుందని గోవా అధికారంగా ప్రకటించిందట. ఈ వ్యాధి ఆడవారిలోకన్న మగవారిలో ఎనిమిది లేక ఏడు రెట్లు అధికమట.

## రైలుపై పిడుగు

సెప్టెంబరు 29వ తేదీన బొంబాయికి 20 కిలో మీటర్ల దూరంలోని విటల్‌వాడి, కళ్యాణ్ స్టేషన్‌ల మధ్య నడుస్తున్న రైలుమీద పిడుగు పడిందట. ఈ పిడుగుపాటువల్ల ఓ పెట్టెకు నిప్పంటుకుని ఇరవైమందికి పైగా గాయపడ్డారట. అయితే ప్రాణనష్టం మాత్రం లేదట.

## గుండం — ప్రాణగండం

ఖమ్మంజిల్లా గౌముద్మారు గ్రామానికి చెందిన బి. పుల్లయ్య అనే ఆయన భార్య మల్లమ్మ గౌముద్మారు రేవుట్ల గోదావరి రేవులో స్నానం చేస్తూ ఉత్సాహంతో ఓ అడుగు ముందుకు వేసిందట. ఆ ప్రదేశంలో గుండం వుండడంవల్ల ఆమె మునిగిపోయి, చనిపోయిందట.

చేశాను బావా! నా పుట్టినరోజు రోజే అతన్ని నేనెంతగా ప్రేమిస్తున్నానో అర్థమైంది. మన పెద్దవాళ్లు మనమీదేవో ఆశలు పెట్టుకున్నారని మన జీవితాన్ని పాడుచేసుకోలేం కదా! అమ్మావాళ్ళతో అన్ని విషయాలూ విపులంగాచెప్పి ఒప్పించటానికి ప్రయత్నిస్తాను. లేకపోయినా మా పెళ్లి జరిగితీరుతుంది.''

రవి కళ్లు తృప్తిగా మెరిశాయి. ''గుడ్. సరైన నిర్ణయం తీసుకున్నావు. కాస్త ఈ జ్వరం తగ్గాక నేను గుంటూరు వచ్చి అత్తయ్యవాళ్లతో స్వయంగా మాట్లాడతాను మనిద్దరి పెళ్ళికి నీ అంగీకారంతోపాటూ నా అంగీకారం కూడా లేదని చెప్తే వాళ్లు జయరాంతో నీ పెళ్లికి త్వరగా ఒప్పుకుంటారని నా నమ్మకం. నేనెలాగో ఓ స్నేహితుడి పెళ్లికి గుంటూరు వెళ్లాలి కూడా.'' అన్నాడు.

నీరజ కళ్లల్లో ఉత్సాహం ఉరకలువేసింది. ''థాంక్స్ బావా! నేనూ మామయ్యతో చెప్తాను మాలే నీకు సరైన జంట అని.''

రవి ఉలిక్కిపడ్డాడు. ''వద్దు! ఆ పని మాత్రం చెయ్యకు. నేను మాలని చేసుకోటం లేదు. మాది ఉత్త స్నేహమేనని చెప్పానుగా'' అంటూ పైకి వెళ్లిపోయాడు.

నీరజ 'ఏమిటది' అన్నట్టు అయోమయంగా నావైపు చూసింది. తెలీదన్నట్టు తల అడ్డంగా ఊపాను.

అక్టోబరు 14, సోమవారం 1974.
రవి వైఖరిలో మార్పేమీ లేదు
సాయంత్రం కంపెనీనుండి రాగానే నా పేర

# గెలుపు నాదే

వచ్చిన ఉత్తరం అందించింది నీరజ దస్తూరి మావాళ్లెవరిదీ కాదు. కవరుచించి కింద సంతకం చూశాను. మాల!

''సుజాతా!

ఈ మాల సంగతి నీకు తెలుసుకదూ! అనుకున్నది సాధించకుండా ఉండటం నా స్వభావానికే విరుద్ధం. నేను రవిని ప్రేమించాను. పెళ్లి చేసుకుందామనుకున్నాంఇద్దరం. ఆ నమ్మకంతోనే రవికి లొంగిపోయాను. ఫలితం! రవి ప్రతిబింబం నాలో చోటు చేసుకుంది. కానీ ఇప్పుడు రవికి నామీద మోజు తగ్గిపోయింది. తనకీ, నాకూ ఏ సంబంధమూ లేదంటున్నాడు అతనెందుకలా చేస్తున్నాడో నాకు తెలుసు. ప్రస్తుతం అతని మనసు నీమీద వుంది. బహుశా నిన్ను పెళ్లిచేసుకోవాలనుకుంటున్నాడేమో! అది అసంభవమని గుర్తుంచుకో. నాతో అతనికి సంబంధం ఉందని నిరూపించటానికి అతను వ్రాసిన ఎన్నో ప్రేమలేఖలూ అతనూ, కలిసి తీయించుకున్న ఫోటోలు ఉన్నాయి. నిన్ను అడ్డు తొలగించుకోటం పెద్ద కష్టమేమీ కాదు. నీవల్ల నన్ను రవి పెళ్లిచేసుకోటంలేదని కోర్టులో కేసు పెట్టటానికి కూడా వెనుకాడను. కనుక రవిని మా పెళ్లికెలా ఒప్పిస్తావో నీ ఇష్టం. అర్థమైందిగా! ఉంటాను.

ఇట్లు
మాల.''

ఉత్తరం ముగించి చరచరా రవి గదిలోకి నడిచాను.

''ఏమిటిది?'' కవరతని ముందు పడేసి విసురుగా అడిగాను.

శూన్యంలోకిచూస్తూ ఏదో ఆలోచిస్తున్న రవి ఉలిక్కిపడి అదందుకు చదివి వివర్ణమైన ముఖాన్ని పైకెత్తాడు.

''నన్ను క్షమించు సుజాతా! రెండ్రోజుల్నుంచీ ఈ విషయంగానే మధనపడుతున్నాను. మాల ఎందుకు నన్నిలా పీడిస్తోందో అర్థం కావటంలేదు. నీ మీద ఒట్టేసి చెప్తున్నాను. మాలతో అందరికంటే కాస్త చనువుగా తిరిగిన మాట నిజమే. కానీ...కానీ...శారీరక సంబంధాలు పెట్టుకునేంతగా దిగజారలేదు నేను.'' ఎర్రబడ్డ ముఖాన్ని ప్రక్కకి తిప్పేసుకున్నాడు రవి.

''అసలు మీరామెకి ఉత్తరాలెందుకు వ్రాసారు? మాటలెన్నైనా అనచ్చు. కానీ వ్రాతపూర్వకంగా ఉంటే అవే ఆధారాలుగా మార్తాయని ఎందుకు ఊహించలేకపోయారు?'' కోపంగా అడిగాను.

''అదే, అదే సుజాతా నేను చేసిన పొరపాటు. అయినా నా గురించి కాదు నా బాధ. అనవసరంగా నువ్విందులో చిక్కుకున్నావేనని! ...'' అతని కంఠంలో నిస్పృహ ధ్వనించింది.

శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాను.

కాస్సేపయాక నా రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకుంటూ, ''నువ్వేం బాధపడకు సుజాతా! అనవసరంగా ఆలోచించి బుర్ర పాడుచేసుకోకు. నేనేదో చేస్తాను. నిన్ను మాత్రం ఈ రొంపి నుండి బయట పడేలా చూస్తాను సరేనా!'' అన్నాడు అనునయంగా.

అతని చేతుల్ని విడిపించుకుని విసురుగా క్రిందికి రాబోతూ మధ్యలో ఆగి, ''మరి మాలంటే మీకు స్నేహం తప్ప మరో భావం లేకపోతే ఆమెని పెళ్లి చేసుకుంటానని నాతో ఎందుకు చెప్పారు?''అనుమానంగా అడిగాను.

నే ననుకున్నట్లు రవి తడబడలేదు. ''అదా ?! నేను మాలని పెళ్లి చేసుకుంటున్నానని చెప్తే నీ ముఖం ఎలా ఉంటుందో చూద్దామని...''

''ఎలా ఉంటుందో అంటే?!'' అర్థం కానట్లు అడిగాను.

''అంటే ఈర్ష్యా అసూయా లాటి భావాలు కనిపిస్తాయేమోనని చూసాను.''

ఆఫీసులో చేరింది మొదలు చూస్తున్నా! అదే-ఆముదం తాగినముఖం! మార్పులేదు!
ఆఫీసులో చేరిందిమొదలు చూస్తున్నారు. అదే-గొర్రెతో జీతం! ఎదుగూ లేదు
—బాబు—

"ఎందుకు కనిపిస్తాయి ?" ఆశ్చర్యంగా అడిగాను.

రవి నవ్వాడు. "సాధారణంగా తను ప్రేమించిన వ్యక్తి తనని కాక మరెవర్నో పెళ్లి చేసుకుంటున్నాడని తెలిసినప్పుడు ఈర్ష్య, బాధా లాటివి కలుగుతాయంటారు. బహుశా నువ్వు నన్ను ప్రేమించావో లేదో తెలుసుకోవాలని అలా చేసావేమో ?!" నవ్వుతూనే అన్నాడు.

అతని మాటలు నాకు సరిగ్గా అర్థం కాలేదు అర్థం చేసుకోవాలనే ఆసక్తి లేదు. కాబట్టి ఇక అక్కడుండకుండా క్రిందికి వచ్చేసాను.

* * *

అక్టోబరు 21, సోమవారం 1974.

చాలా రోజులయిందేమో ఈ మధ్య ఇంటి మీద ధ్యాస మళ్ళుతోంది నాకు. దానికి తోడు దసరాపండగ సెలవలుకూడా కలిసి రావటంతో మరి రెండు రోజులు సెలవు పెట్టి ఓ సారి ఊరికి వెళ్లాలని నిశ్చయించుకున్నాను. ఏ కళనున్నారో మాధవరావుగారు కూడా వెంటనే అందుకు అనుమతించారు.

ఈ మధ్య చాలా విశేషాలు జరిగాయి. మాధవరావుగారు వచ్చికూడా నాలుగు రోజు లవుతోంది. రవి అనుకున్నట్టుగా స్నేహితుడి పెళ్ళికి వెళ లేకపోయాడు. అందుకు కారణం అప్పటికింకా అతను బాగా కోలుకోకపోవటమే. ఇప్పటికీ అతను తరచూ తలనొప్పితో బాధ పడ్తూండటం నేను గమనించకపోలేదు. మాధవరావుగారు వచ్చిన రెండ్రోజులకే తల్లికి బాగలేదని టెలిగ్రామ్ రావటంతో నీరజ ఊరికి వెళ్ళిపోయింది వెళ్లేముందు ఆయనతో జయరాం సంగతి చెప్పి మరీ వెళ్లింది. ఆమె ఆ విషయం చెప్తూంటే ఆయన ముఖంలో లీలగా కదిలిన బాధ నేను పసిగట్టలేకపోలేదు. సహజమే మరి !

"మంచిదమ్మా! మీరూ పెద్ద వాళ్ల య్యారు. మీ మంచి చెడ్డలు మీరు నిర్ణ యించుకోగలరు. మీ నిర్ణయాలకీ, ఆనందా నికీ నేనెందుకు అడ్డు రావాలి ? మీ అమ్మకి కూడా ఉత్తరం వ్రాస్తాను మీ ఇద్దరికీ పెళ్లి జరిపించమని. అది అర్థం చేసుకోగల దనే నా నమ్మకం." అన్నారాయన. నీరజతో పాటూ జయరాం కూడా ఆమె తల్లి తండ్రుల అనుమతి అడగటానికి బయల్దేరి వెళ్లాడు. అతనివైపు పెద వాళ్లెవరూ లేరు. తల్లి తండ్రులు చిన్నప్పుడే పోయారట. పెంచి పెద్ద చేసిన పెదన్నగారి అనుమతి వెంటనే లభించిందట.

"మరి నీ సంగతేమిట్రా ?" అని మాధవ రావుగారు రవిని అడిగినప్పుడు అతనేం మాట్లాడకుండా ఉండిపోయాడు కాస్సేపు.

ఈ రోజు చిత్రమైన సంఘటన, నా జీవితంలో నేనెన్నటికీ మర్చిపోలేని సంఘటన ఒకటి జరిగింది.

భోజనాల దగ్గర మాధవరావుగారు మళ్లీ రవి పెళ్లి ప్రస్తావన ఎత్తారు.

"చూడు రవీ! నీకు పాతికేళ్ళు పైబడి పోయాయి. ఇప్పటికైనా పెళ్లిచేసుకు స్థిర పడితే నాకూ సంతోషంగా ఉంటుంది. నీరజ

# గెలుపు నాదే

సంగతి వదిలెయ్. మేనరికం నీకు యిష్టం లేకపోయిందనుకుందాం. ఎన్నో రోజులుగా నీకు ఎంతోమందితో పరిచయం ఉంది. వాళ్ళల్లో ఒక్కళ్ళూ నచ్చలేదా?'' అడిగా రాయన. రవి చిన్నగా నవ్వి, ''నాకూ పెళ్ళి చేసుకోవాలనే ఉంది నాన్నా! మీకూ సుజా తకీ అభ్యంతరం లేకపోతే ఆమెను చేసు కుంటాను'' అన్నాడు.

అతని మాటలకి మాధవరావుగారెంత ఆశ్చర్యపోయారో, అంతకు రెట్టింపు బిత్తర పోయాను నేను. ఇది నేను బొత్తిగా ఊహిం చని సంఘటన. భోంచేస్తున్న దాన్నల్లా చెయ్యి కడిగేసుకుని పైకి నా గదిలోకి వెళ్ళి పోయాను మాధవరావుగారు వారిస్తున్నా వినకుండా.

ఐదు నిమిషాల తరవాత రవి వచ్చాడు. ''ఏమిటలా పారిపోయావు?'' అడిగాడు.

ఒళ్ళు మండింది నాకు. ''సిగ్గుపడేం పారిపోలేదులెండి. మీరు నన్నెందుకు పెళ్ళి చేసుకుంటానన్నారో నాకు తెలుసు. మీవల్ల నేనేదో కేసుల్లో ఇరుక్కుంటాననీ, అప్పుడు నన్నెవరూ పెళ్ళి చేసుకోడానికి ముందుకి రారనీ అనుకుంటున్నారు కదూ! మీకో నమ స్కారం. మీ త్యాగం నా క క్క ర్లే దు'' కోపంగా అన్నాను.

రవి రెండు నిమిషాలపాటూ ఏంమాట్లాడ లేదు. తరవాత ''నువ్వు చెప్పిందీ ఒక కార ణమే సుజాతా! కాని నువ్వు నమ్మూ నమ్మక పో. ఇక్కడికి వచ్చిన మొదటిరోజునుండీ నేను నిన్ను ఆరాధిస్తూనేఉన్నాను'' అన్నాడుకొద్దిగా వణుకుతున్న కంఠంతో. బిత్తర పోయాను. ''ఆత్మవంచన చేసుకోవటం మంచిది కాదు'' అన్నాను సూటిగా చూస్తూ.

''అంత అవసరం నాకేం లేదు. నేను మొన్న నీతో చెప్పలేదూ! నా చుట్టూ తిరిగే ఆడపిల్లలెవరూ నాకు నచ్చలేదు 'సరదాకు తిరగవచ్చు' అనుకునే తిరిగాను వాళ్ళతో. అయితే ఎప్పుడూ హద్దులు దాటలేదు.నీపట్ల నాకెంత పవిత్ర భావం ఉందో చెప్పలేను. నువ్వంటే నా కభిమానమని గుండెలమీద చెయ్యి వేసుకుని చెప్పగలను. నీరజలో నాకేం లోపం కనిపించిందని నువ్వడగవచ్చు నిజానికి ఆమెని చేసుకోవటానికి పెద్ద కారణాలేంలేవు మొదట్నుంచీ ఆమెంటే అలాటి భావం లేదు నాకు'' అన్నాడు రవి నా చేతిలో తన చెయ్యి వేస్తూ.

కళ్ళు పెద్దవిచేసి అతను చెప్తున్నది విన సాగాను. ఈసారి కొద్దిగా విషాదంగా.

''నేను ప్రేమించే అమ్మాయితోపాటూ నన్ను ప్రేమించిన అమ్మాయి అయితేనే చేసు కోవాలనుకున్నాను నేను. కానీ నాకు తెలుసు నువ్వు నన్ను ప్రేమించలేదు'' అన్నాడు.

''కానీ ద్వేషించలేదు.'' వెంటనే అన్నాను.

''అంతేకాని ప్రేమించానని అ న లే వు. అవునా ?''

''అనలేనని ధైర్యంగా చెప్పగలను.''

నిజమే! రవిచుట్టూ నేనెప్పుడూ వాళ్ళ అల్లుకోలేదు.

అతను అభినందిస్తున్నట్టుగా నా వైపు చూశాడు. ''థాంక్స్ సుజా ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అంటూ సినిమా డైలాగు కొట్టనందుకు.''

కాస్సేపాగి, ''మనిద్దరం ఒకటైతే ఇక మాల మనల్నేం చెయ్యలేదు సుజాతా!'' అన్నాడతనే.

ఏవో గుర్తొచ్చి చటుక్కున లేచి నిల్చు న్నాను, ''మీకో శుభవార్త చెప్తబోతున్నాను. నాకేమిస్తారు?'' అన్నాను కొంటెగా.

రవి చిత్రంగా చూసాడు. ''ఏమిటి ?'' అన్నాను ఆశ్చర్యంగా.

(ఇం కా వుం ది)

---

## శుక్రగ్రహం ఉపరితలం

వీనస్ - 9 నుంచి శుక్రగ్రహంమీద దిగిన అవతరణ నౌక పంపిన చిత్రాలను పట్టి అది శిలా ప్రవాహంమీద దిగినట్లు కనిపిస్తూంది.

భూరసాయన సంస్థకు సంబంధించిన అలగ్జాండర్ బాదిలేవ్‌స్కీ వీనస్ - 9 పంపిన చిత్రాల నుంచీ యీ విషయాలు తెలుస్తున్నాయన్నారు, శుక్రగ్రహంమీద రాళ్ళున్నాయి. అరాళ్ళు చదునుగా, అంచులుతేరి వున్నాయి. అంటే. అవి పురాతన శిలలు కావన్నమాట. ఇదివరకు భావించినట్లు చదునైన ఎడారినిగాక మిట్ట పల్లాలతో వున్న భూమిని చూస్తున్నాం.

భూగర్భ నిర్మాణరీత్యా శుక్రగ్రహం మృతగ్రహం కాదని చెప్పగలం. అది సజీ వంగా వుంది. ఈ చిత్రాలనూ, యితర పరిశోధనల ఫలితాలను జాగ్రత్తగా పరిశీ లించాకనే శుక్రగ్రహపు భూగర్భ పరిణామం గురించి సరిగ్గా చెప్పగలుగుతాము. దాని మీద నున్న రాతిబండలు గ్రేనైట్ బండలలా కనిపిస్తున్నాయి అన్నారు.

---

## సామాన్యుని సణుగుడు

(16వ పేజీ తరువాయి)

పైనా కొనుక్కోగలమా చెప్పండి! కొనేస్తోమత గలవాడు ''రిడక్షన్ సేల్సు'' కోసం ఎదురెందుకు చూస్తాడూ... కొనలేకనేకదా నాలుగు రకాలు చూసి ఒక రకం కొనాలని ఉవ్విళ్ళూరుతూ, మనం పోతాం. అమ్మమ్మా ? సినిమాపాటల లౌడ్ స్పీకర్ల గోలలో రంగురంగుల దీపాల తోరణాల మధ్య యీదొచ్చితన్నినట్లున్న మన మొహాలు ఏలారీ క్రిందో బస్ క్రిందో పడకుండా— 'బిక్షాలకూటికి దిష్టి తగిలెనన్నట్లు మన పర్సు తస్కరింపబడ కుండా బయటపడటమే యీ రోజుల్లో కష్టం అందుకనే ''లౌడ్ స్పీకర్ అన్నాయి. జాగ్రత్త...'' అని హెచ్చరిక చేసుకొని వోపిగ్గా వెళ్ళాలి ''రిడక్షన్ మార్కెట్''లోకి—పండగలకి ఇంత హంగామాచేసి గోలచేసి రిడక్షన్ చేస్తారే!యీ ఖర్చంతా మానేసి దాన్నికూడా సరకు మీది రిడ క్షన్‌లోవేస్తే ఏడాదంతా ధరలు తగ్గించినవస్తా లు దొరుకుతాయిగా...కాని యీ తగ్గింపు ధరల కథవేరు...లేకపోతే పూర్వకాలం అమావాశ్య, పండు గలకు శని ఆది వారాలకు మాత్రం మ్యాటనీలు అన్న సినిమా ప్రకటనలు పోయి రోజూ మ్యాట నీలు వచ్చినట్లే ఏడాదంతా రిడక్షన్ సేల్సు వుండే దినాలు రాకపోతాయా అని ?

(★ ★ ★)

# మీ బిడ్డకు 3 నెలలు నిండాయా?

3 నెలలు నిండిన మీ బిడ్డలను
కేవలం పాలతోటే సరిపెట్టేయకండి;
వాళ్ళకి బలమైన రక్తం కోసం,
ఐరన్‌తో నిండిన శక్తినిచ్చే (ఘన)
ఆహారం అవసరం—అని
డాక్టర్లు అంటున్నారు:



ఫారెక్స్‌ను ఇవ్వండి.
ఇది ఐరన్‌తో నిండినదే
కాక, శక్తినిచ్చే (ఘన)
ఆహారం కూడా!

ఒక్క ఫారెక్స్ మాత్రమే
మీ బిడ్డ పెరుగుదలను బట్టి,
అవసరమైన ఆహార పదార్థాలను
బిడ్డకు అందివ్వడంలో మీకు
తోడ్పడుతుంది.

పెరుగుతూన్న మీ బిడ్డకి ఫారెక్స్
ఏమేమి ఇస్తుందో చూడండి:

- రోగ నిరోధక రక్తం, శక్తి కోసం తోడ్పడు ఐరన్.
- పళ్ళు, ఎముకలు బలంగా ఉండటానికి కావలసిన కాల్షియం మరియు విటమిన్-డి.
- బాగా పెరిగేందుకు పుష్టి జీర్ణమయే ప్రోటీన్.
- ఈ వయసుకు ఆయుర్దాయం, అందుకు కావలసిన బలం.

మీ బిడ్డ పెరుగుదలతోపాటు ఫారెక్స్ ఎంత ఇవ్వాలో తెలుసా:

| బిడ్డ వయస్సు | ఎంత ఫారెక్స్ ఇవ్వాలి |
| --- | --- |
| 3—6 నెలలు | 1—2 చిన్న చమ్చాల నిండుగా, రోజుకు రెండు సార్లు |
| 6—9 నెలలు | 3—4 చిన్న చమ్చాల నిండుగా, రోజుకు మూడు సార్లు |
| 9 నెలలు—1 సంవత్సరాలు | 4—6 చిన్న [illegible] నిండుగా, రోజుకు నాలుగు సార్లు |

CMGF-46-234 TEL




## ఫారెక్స్

3 నెలలు దాటినప్పటినుంచి సంపూర్ణమైన పెరుగుదలకు
మీ బిడ్డయొక్క మొట్టమొదటి ఘన ఆహారం.

*ఉచితం: ఫారెక్స్ గురించిన పుస్తకం ఉచితంగా పొందడానికి 25 పై. స్టాంపు టిక్కెట్టుతోపాటు మీ పేరు, చిరునామాను ఈ చిరునామాకు (ఏ భాషలో కావాలో తెలియపరుస్తూ) పంపించండి: డిపార్టుమెంట్ A-[illegible], పోస్టు బాక్సు 10658, బొంబాయి 400 025.*

గ్లాక్సో

# అవీ ఇవీ అన్నీ

## తేనె చుక్కలు

రచన : శ్రీ కె. రవీంద్రప్రసాద్, 30 పేజీలు. వెల : రు. 50 పై. ప్రతులకు : శ్రీ కె. రవీంద్ర ప్రసాద్, రవీంద్ర ప్రసాద్ ప్రచురణలు అంగలకుదురు, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా.

## త్యాగఫలితం

పై పేరు గల పిల్లల కథల పుస్తకం మా కార్యాలయం జేరింది. రచయిత నరిశేపల్లి లక్ష్మీనారాయణ. పేజీలు 53. వెల: రు. 2.00 లు. ప్రతులకు: రచయిత పేర, రామన్నవారి వీధి, గుంతకల్లు—2. కి వ్రాయవచ్చును.

## ఇదో సినిమా కథ

శ్రీ వుడతా కృష్ణారావు రచించిన సాంఘిక నాటిక "ఇదో సినిమా కథ" మా కార్యాలయం చేరింది. 54 పేజీలు, వెల 2 రూపాయలు. ప్రతులకు:విజయ శ్రీ పబ్లికేషన్స్. మెయిన్‌బజారు, విజయవాడ -1 ●







Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

ఆర్. బి. కె. ఆర్. — మద్రాను

# డాక్టర్ సలహాలు

వాకు తెల్లమచ్చలు ఒక ఇంజక్షన్ ద్వారా వచ్చినట్లు అభిప్రాయము. కాని యిప్పుడు అవి కొంచెము తగ్గుచున్నవి. ఇవి 4 సం.ల నుండి వున్నాయి. డాక్టర్లు ల్యూకోడెర్మా అన్నారు. ఈ మచ్చలు త్వరగా తగ్గాలంటే ఏ మందులు వాడాలి ?

★ ఇంజక్షన్ చేసేచోట మాత్రం చిన్నదిగా తెల్లటి మచ్చ రావటం, కొంతవరకు సహజం. కాని మచ్చలు పెద్దవిగా రావటం — ఒకవేళ చాలా ఇంజక్షన్లవల్ల రాగలిగినా) చాలా అరుదు. "ల్యూకోడెర్మా"కి — సరి అయిన, నమ్మకమైన మందులు— యింతవరకు కనుగొనబడలేదు. కారణమేమిటంటే ఈ రోగానికి యింతవరకూ కారణం కనబడలేదు గనుకనే !

జి. ఆర్. కె. పి. — సికింద్రాబాద్

నాకు నోటిపూత 2 సం.లుగా వస్తున్నది. ఇది వచ్చేముందు నోరు మంటపెడుతుంది. ఈ పూత ఎక్కువగా నాలుక, రెండు దవడలు, పెదవులు, అంగిటిమీద వచ్చుచున్నది. పూత వచ్చిన ఆ ప్రాంతములో చిన్న గుంట ఏర్పడుతుంది. గుంట ద్వారా రక్తము పడుతున్నది. ఈ సమయములో ఆహారమేమీ తీసుకోలేకపోతున్నాను. ఈ విధముగా 5, 6 రోజులు వుండి, ఆ గుంటమీద తెల్లని పొరగా ఏర్పడి తగ్గుచున్నది. దీనికి నివారణోపాయము తెల్పండి.

★ ఇలా తరచూ రావటం శరీరంలో విటమిన్ 'బి'కాంప్లెక్స్‌కి చెందినవి లోపించినందువలననే. ఈ తెగకు చెందిన విటమిన్లలో విటమిన్ 'బి–2' అంటే రిబోఫ్లేవిన్ లోపించటంవల్ల ఈ రకంగా నోటి "పూత" ఏర్పడుతుంది. నోటిపూతకి ఎక్కువగా కామంచి ఆకు రసం, కొబ్బరిపాలు, సగ్గుబియ్యం జావ, దంపుడుబియ్యం అన్నం తిరిగి రాకుండా ఉండటానికి, వచ్చినప్పుడు బికాంప్లెక్స్ మాత్రలు వాడాలి.

ఎస్. ఎస్. — కాకినాడ

గర్భకోశంలేని స్త్రీలు వైవాహిక జీవితానికి వైముఖ్యం చూపుతారు కనుక భర్తలు వారిపట్ల అయిష్టంగా వుంటారని చాలామంది చెబుతున్నారు. అది ఎంతవరకు నిజం ? మాకు ఒక పాప, బాబు వున్నారు. చాలనుకుంటున్నాము. ఈ పరిస్థితులలో గర్భకోశం తొలగించటమే మంచిదా ?

★ గర్భకోశం లేని స్త్రీలలో, వారి గ్రంథుల (గర్భాశయాన్ని ఉత్తేజపరచేవి) ఉత్పత్తి అయ్యే హార్మోనుల ప్రవృత్తికి లోనుగారు గనుక, వారిలో అంతక్రితం ఉన్నట్లుగా — శారీరక వాంఛలు తగ్గటం న్యాయమే ! కాని పూర్తిగా వారు భర్తల పట్ల అయిష్టత చూపుతారనటం శాస్త్రసమ్మతం కాదు. మీరు కుటుంబాన్ని పరిమితం చేసుకోవటానికి గర్భకోశం తొలగించుకోనక్కరలేదు.

సి. యస్. యస్. — తెనాలి

టి. బి. గ్లాండ్సుకి 60 స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్లు, దానితోబాటుగా ఒక సం. పాటు ఐసోనెక్స్ మాత్రలు వాడాను. అవి మానేసి 6 నెలలు అయింది. ఈ మందులవల్ల విపరీతముగా వళ్ళు వచ్చింది. లావు తగ్గే మార్గమేమిటి?

★ "టి. బి." అనే క్షయరోగం వున్నవారు సహజంగానే, రోగం ఉధృతంగా వున్నప్పుడు క్షీణించి లేక కృశించిపోవటం సహజం. ఈ రోగ నివారణకై మందులు వాడితే మామూలుగా ఆ వయస్సులో వుండేవారి శరీరం — ఎలా ఉంటుందో అదే పరిమాణంలో ఈ రోగుల శరీరం కూడా పెరుగుతుంది. మందుల వాడకంవల్ల మామూలు కన్నా ఎక్కువగా పెరగటం జరుగదు. లావు తగ్గడానికి మీరు మందులు వాడవలసిన పనిలేదు.

కె. యస్. ఆర్. — కడప

నా వయస్సు 21 సం.లు. వయో, శరీరాల కనుగుణంగా మూత్రపిండములు ఎదగకపోవుటకు కారణం ఏదైనా వీక్‌నెస్ అయివుంటుందా ? వయస్సుకి, శరీరానికి తగ్గవిధంగా ఎదగాలంటే ఏమిచెయ్యాలి ?

★ మీరనే "మూత్రపిండాలు" — "టెస్టిస్" అనేవి (వ్యావహారికంగా — బీజాలు) అయివుంటాయని నా అనుమానం. ఎందుకంటే, మీరన్న మూత్రపిండాలు (కిడ్నీస్) "కడుపు" భాగం లోపల ఉండి బయటకి కనబడదు గనుక. "టెస్టిస్"కి — మూత్రపిండాలకి వయస్సుకి - ఎదిగే (పెరిగే) విషయంలో చాలా దగ్గర సంబంధం వుంది. టెస్టిస్ పెరగటం, హార్మోనులఉత్పత్తిపై ఆధారపడి వుంటుంది. వైద్య పరీక్ష చేయించుకోవటం అన్ని విధాలా మంచిది.

కె. జి. ఆర్. — కాకినాడ

'ఆర్టికేరియా ఆనే వ్యాధి యొక్క లక్షణాలు, నివారణోపాయము తెలుపండి. కడుపులో పాములుండుటకు దీనికి ఏమైనా సంబంధము కలదా ?

★ "ఆర్టికేరియా" అంటే చర్మంపైన, పొక్కులలాగా ఒక క్రమపద్ధతిలో యేదో ఒక కారణం ద్వారా ఏర్పడే రోగలక్షణం మాత్రమే ! సాధారణంగా ఈ చర్మలక్షణాలు శరీరంలోని యితర రోగాలను సూచిస్తాయి. శరీరానికి పడని పదార్థాల వల్ల ఏర్పడే "అలర్జీ" యొక్క బాహ్య స్వరూపమే ఈ ఆర్టికేరియా ! కడుపులోని క్రిముల గ్రుడ్లు రక్తంలో కలిసినపుడు లేక, క్రిములనుంచి వెలువడే హానికర పదార్థాల వల్ల కూడా 'అలర్జీ' యేర్పడి బాహాటంగా ఈ "ఆర్టికేరియా" కనబడవచ్చును.

—డా॥ కె. వెంకటేశ్వరరావు

# యువతరం



కె. రవీంద్రప్రసాద్, బి. యస్సీ. చదువుకున్నాడు. హోమియోపతి నేర్చుకున్నాడు. యోగాసనాలను అభ్యాసం చేశాడు. కొంత కాలం క్రితం కార్టూన్లు కూడా పత్రికల్లో పడ్డాయని చెప్పాడు. ఏది ఏమైనా జీవితానికి లక్ష్యం జ్ఞానం సంపాదించటమేనని భావిస్తున్నాడు. తాపీగా మెత్తగా మాట్లాడుతూ ఎన్నో రంగాలలో కుతూహలం వున్న యీ యువకుడు భావకవి. పామిస్ట్రీ, ఆస్ట్రాలజీ లాంటివి చదువుతున్నాడు.

హోమియోపతి చదువుకుని మళ్లీ డబ్బుకోసం అల్లోపతి మందులు యింజక్షన్లు యిచ్చేవారంటె రవీంద్రప్రసాద్‌కి తగని కోపం — ఫిలాసఫీ గ్రంథాలు చదవటం అలవాటు 'నేనెవర్ని ?' అన్న జిజ్ఞాస వుందని తెలిపిన యీ యువకుడు స్వామి వివేకానంద, రామతీర్థ, శివానందగార్లను అధ్యయనం చేశాడు — యీ మధ్యనే యితని మ్యూజింగ్స్ సంకలనం ఒకటి ఆవిష్కరించడం జరిగింది.

అతని అభిప్రాయాలు కొన్ని యిలా వున్నాయి. ఆటలంటె ఇష్టమే. ఆటలు నేను ఆడను. సర్దాగా చదరంగం, పేకాట పందేలు లేకుండా ఆడమంటె ఆడతాను. ఆటలవల్ల ఆరోగ్యమున్నదంటాను. ఆటలే ధ్యేయంగా చదువు చెడగొట్టుకునే వారంటె అసహ్యం !

నేను ఆడ, మొగా వొకటే నంటాను. సృష్టికర్తకు మొగవాడి కన్నా ఆడదంటె ఎక్కువ ఇష్టమనీ, గౌరవమనీ కూడా నేనంటాను. ఎందుకంటె ఎంత గౌరవమూ, ఎంత నమ్మికా లేకపోతే మహోన్నతమైన మాతృ పదవి ఆమె కిస్తాడు ? ఇక నేటి పత్రికల్లో ఆడవాళ్ల వ్యాసాలు చూస్తే 'బాపు' కార్టూను చూసినంత నవ్వు వస్తుంది. ఆడవాళ్ళల్లో వాళ్ళల్లో వాళ్ళకే అండర్‌స్టాండింగ్స్ తక్కువని నా అభిప్రాయం !

మన రాజకీయ వ్యవస్థ మీదకూడా నా అభిప్రాయం ఇది. ఇంటర్‌మిడియట్ చదివినవారికే వోటు, పోస్టు గ్రాడ్యుయేట్ అయినవారే నాయకులుగా నిలబడాలి... లాంటి దృఢమైన అభిప్రాయాలున్న యీ యువకుని ఆశయాలు ఆచరణ రూపం పొందాలని ఆశిద్దాం. — [ పి ]